RECAP: RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHAN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, A POWERFUL GADGET WITH 10 POWERS.

EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***-RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

PARLE

POPPINS®
Doon Kya?

# Ram and Shyam

# జోమ్‌బాట్స్

## పార్ట్ 1




ఇషిహారా లాబొరేటరీ – జపాన్

గొప్ప సైటిస్టు చియో టొయమచే తయరుకాబడిన రోబోట్స్ యొక్క సీరీస్ ఆయన మరణించిన మర్నాడే మాయం అయినది. ఈ రోబోర్టులు 34 ఏళ్లకు పూర్వం స్వయంగా ఆలోచించే విధంగా తయారుచేయబడ్డాయి. ఈ ప్రయోగం చాలా ప్రమాదకరంగా కనుగొన్న కారణంగా అన్ని రోబోట్లని వెంటనే నిర్వినియోగం చేసారు.

ISHIHARA LABORATORY

ఈలోగా, జపాన్‌ని కొంత మంది అనుమానాస్పద జీవరాశులు దాడి చేసాయి. లార్జ్–స్కేల్ వినాశనంని జరిగింది. వాళ్ళు చూడ్డానికి జోంబీస్ కంటే అసహ్యంగా ఉన్నారు మరియు రోబోట్స్ అంత శక్తివంతమైనవి – కనుక స్థానికులు వారిని ‘జోంబోట్స్’ అని పిలుస్తారు.

రామ్ మరియు శ్యామ్ వారి లివింగ్ రూంలో ఇంటర్నెషనల్ న్యూస్ చానెల్‌ని చూస్తున్నారు.

BREAKING NEWS

మన దేశానికి వచ్చే ముందే వారిని కిందికి దించేయాలి

రామ్ మరియు శ్యామ్ జపాన్‌లో

మీరేం ఆలోచిస్తున్నారు? దీని వెనకాల ఉన్నదెవరు?

దీన్ని కనుక్కోడానికి ఒకే ఒక్క మార్గం ఉంది.

డెకాట్రిక్స్‌ని వాడుతూ, రామ్ మరియు శ్యామ్ తమని తాము జోంబోంట్స్‌లా ట్రాన్స్‌ఫాం అవుతూ, వారి గ్యాంగులో చేసి మార్చింగ్‌ని చేస్తూ వారి మాస్టర్ వైపుకు నడిచారు.

నేను పవర్ యొక్క పరిమళాన్ని పసిగట్టాను.

చాలా స్ట్రాంగ్ పవర్, మీ రహస్యాన్ని చెప్పండి.

డెకాట్రిక్స్‌ని వాడుతూ, రామ్ మరియు శ్యామ్ టెలెపథికల్లీగా మాట్లాడుకున్నారు.

అతను డార్క్ పవర్స్‌తో లోడ్ అయినట్లు కనబడుతోంది

అతన్ని మనం ఇద్దరం కలిసి కిందికి తీసుకెళ్ళాల్సి ఉంటుంది.

రామ్ మరియు శ్యామ్ చేతుల నిండుగా పాపిన్స్‌లో పాప్ అయ్యారు

మిమ్మల్ని మీరు మహా శక్తి శాలులని అనుకుంటున్నారు. మీ పవర్స్‌ని వాడుతూ మా రహస్యాలని మీరు ఎందుకు సాధించకూడదు?

జోంబోట్స్ అంటే ఎవరు? రామ్ మరియు శ్యామ్ వారిని నాశనం చేయగలరా?

సశేషం.....

POPPINS

# యువ విజేతలు

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో కాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Swati Enclave,
Door No 5 & 6,
Amman koil street,
vadapalani, chennai-26
(or)
online@chandamama.com

## యువ షూటర్ యాష్

మపుసా గోవాకి చెందిన యాష్ ఒక చిన్నారి షూటర్. రాంచీలో ఈ మధ్యనే జరిగిన జాతీయ క్రీడల్లో 10 మీటర్ల ఎయిర్ రైఫిల్ విభాగంలో పాల్గొన్నాడు. ఇతడి తండ్రి యోగేశ్వర్ పడ్గోస్కర్ ఒక ప్రతిభావంతుడైన షూటర్. ఇండోర్‌లో జరిగిన అఖిల భారత షూటింగ్ పోటీల్లో రజత పతకం గెల్చుకు న్నాడు. తన చిన్నారి కుమారుడిని కూడా షూటింగ్ నేర్చు కోవలసిందిగా ఇతడు ప్రోత్సహించాడు.

ఆవిధంగా, ఏడున్నర సంవత్సరాల చిరుప్రాయంలోనే యాష్ షూటింగ్ కళను నేర్చుకోవడం ప్రారంభించాడు. సరస్వతీ విద్యాలయం విద్యార్థి అయిన ఇతడికి సహచరుల నుంచి, పాఠశాల నుంచి కూడా చక్కటి సహకారం లభిస్తోంది.

ఇతడి శిక్షకులైన యువరాజ్ సలూకే, ఎం.ఎస్. భాంగ్లేలు తమ శిష్యుడు 10 మీటర్ల ఎయిర్ రైఫిల్ పోటీలో 562/600 పాయింట్లు సాధించినప్పుడు సంతోషంతో ఉప్పొంగిపోయారు.

రాష్ట్ర స్థాయిలో ప్రతిభ చూపిన తర్వాత యాష్ గోవా జట్టులో తన పేరు నమోదు చేసుకున్నాడు. యాష్ తండ్రి గోవాలో ఒక షూటింగ్ అకాడెమీ ప్రారంభించాడు. దీంతో గోవాకు చెందిన అనేకమంది చిన్నారి షూటర్లు ఈ రంగంపై ఆసక్తి ప్రదర్శిస్తున్నారు.



చిన్నారి యాష్ ప్రముఖ షూటర్ గగన్ నారంగ్ వీరాభిమాని. ఏదో ఒక రోజున తన హీరో స్థాయిని అందుకుంటానని యాష్ ఆశపడుతున్నాడు.

ఈ చిన్నారి షూటర్‌కి చందమామ శుభాకాంక్షలు.



సెప్టెంబర్ 2011 ₹20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh. Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-2 September 2011 Issue-09

# గణపతి బప్పా మోరియా...

హిందూ దేవుళ్లలో అత్యంత ప్రీతిపాత్రుడు, జ్ఞానాధిపతి అయిన గణేశుడి పుట్టినరోజు సందర్భంగా వినాయకచతుర్థి పర్వదినాన్ని ఈ సంవత్సరం సెప్టెంబర్ 1న జరుపుకుంటున్నాము. శాతవాహనులు, చాళుక్యుల కాలం నుంచే వినాయక చతుర్థి సంబరాలు జరుపుకుంటున్నట్లు ఆధారాలు ఉంటున్నప్పటికీ, మహారాష్ట్రలో ఈ పండుగ ఛత్రపతి శివాజీ, పీష్వాల కాలంలో బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. లోకమాన్య బాలగంగాధర్ తిలక్ కృషి ఫలితంగా ఈ పర్వదిన సంబరాలు వ్యక్తిగత స్థాయి నుండి బహిరంగ ఉత్సవాల స్థాయికి మార్పు చెందాయి.

ఈ నెలలోనే మనం ప్రపంచ పర్యాటక దినం జరుపుకుంటున్నాము. మన సంస్కృతి మూలాలనుంచి కొంతకాలంగా మనం పక్కకు జరుగుతున్నాము. మన మూలాల్లోకి మనం తిరిగి రావలసిన అవసరముంది. అతిథి దేవోభవ అని శాస్త్రం చెబుతోంది. మన వద్దకు వచ్చే అతిథులను మనం దేవుళ్లుగా భావించి గౌరవించాలి. ఇతర సంస్కృతులను సహించే స్థాయిని మనం మెరుగుపర్చుకోవాల్సిన అవసరముంది. ఇలా అంటే మనం బలహీనపడుతున్నామని కాదు.

చందమామ పత్రిక ఆవిర్భవించి 64 ఏళ్లు పూర్తయిన సందర్భంగా జూలైనెలలో మా బ్లాగును ప్రారంభించాము. దీనికి చక్కటి స్పందన లభిస్తోంది. అలాగే మేము అంతర్జాలంలో మొబిసోడ్స్‌ని, ఆడియో కథలను ప్రవేశపెట్టాము. వీటిని కూడా పాఠకులు చక్కగా స్వీకరిస్తున్నారు. యువ పాఠకులకు మాత్రమే కాకుండా, పెద్దలకు కూడా సన్నిహితమయ్యేలా మేము మరిన్ని కార్యకలాపాలను ప్రవేశపెట్టబోతున్నాము. పైన పేర్కొన్న వాటిని మీరు పరిశీలించి మీ అభిప్రాయాలను మాకు తెలువపలసిందిగా మీ అందరినీ కోరుతున్నాము.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

చందమామ ఇప్పుడు పూర్వరూపానికి వచ్చేసి చాలా బాగుంది. ఏమైనా కొన్ని కొత్త శీర్షికలు ప్రవేశపెట్టండి.
– కోలార్ కృష్ణయ్యార్, బెంగళూరు

జూలై సంచికలో కథల ఎంపిక చక్కగా ఉంది. కొన్ని కథల్లో ఆయా ప్రాంతాలయాస కలిసింది. వీటిని మాండలిక వాసనలు లేనివిధంగా తిరగరాస్తే బాగుంటుంది.
– ఎం.వి.వి. సత్యనారాయణ, విశాఖపట్నం

చందమామ తొలిసంచికలో ముద్రించిన నా తొలి కథ 'పొట్టిపిచుక', నేన్రాసిన కొత్త కథ 'విజయమాల', 'నా చందమామ జ్ఞాపకాలు' మూడూ ఒకే సంచికలో ప్రచురించినందుకు చాలా సంతోషం. 'పొట్టి పిచుక' కథకు వేసిన బొమ్మలు రంగుల్లో మరింత బాగా కనిపిస్తున్నాయి. కృతజ్ఞతలు.
– అవసరాల రామకృష్ణారావు, విశాఖపట్నం

జూలై సంచికలో కథలన్నీ బాగున్నాయి. ప్రత్యేకించి పి. రంగనాయకమ్మ కథ 'దేవుడితో చదరంగం' మరీ బాగుంది. – ఎస్.ఎస్. ఆర్. మూర్తి, హైదరాబాద్

కొన్ని నెలలుగా 'గో గ్రీన్' కథలను చదువుతున్నాను. ఈ కథలు సమకాలిక స్వభావంతో ఉంటు న్నప్పటికీ, ఈ కథల ఇతివృత్తం పిల్లలకు, సమాజానికి కూడా ఉపయోగకరంగా ఉంటోంది. రచయి తకు అభినందనలు. – ఎమ్. మురళీ మోహన్, అంబాలా కంటోన్మెంట్, హర్యానా

చందమామ తాజాసంచిక చాలా బాగుంది. నా బాల్యం నుండి పత్రికను చదువుతున్నాను. మే సంచికలోని 'గో గ్రీన్' కథ చక్కగా ఉంది. – శైలేష్ కుమార్ బెహెరా, డ్యులా సాహి, కటక్

బెంగాలీ చందమామ ఇటీవలి సంచికలు చదివాను. చక్కగా ఉన్నాయి. పలు కొత్త విషయాలు చేర్చినప్పటికీ కొన్ని విలువైన అంశాలు తీసేశారు. ఫోటో వ్యాఖ్యలపోటీ అద్భుతమైన శీర్షిక. దీన్ని తిరిగి తీసుకువస్తే మీకు కృతజ్ఞుడినై ఉంటాను.
– సంతోష్ కుమార్ రాయ్, పుటియారి వెస్ట్, కొల్‌కతా.

చందమామ సీరియల్స్‌ని పుస్తక రూపంలో ప్రచురించి అందుబాటులోకి తీసుకురండి. ఇటీవలి సంవత్సరాల్లో మీరు రెండు పుస్తకాలు తీసుకువచ్చారు. ప్రతి ఆరునెలలకూ ఒక చందమామ సీరియల్‌ని ప్రచురించండి. పాఠకులు నిజంగా సంతోషిస్తారు. గత 50 ఏళ్ల చందమామలు నావద్ద ఉంటున్నాయి.
– భరత్, బెంగళూరు

చందమామలో విషయాన్ని మార్చాలనుకుంటున్నట్లు సంపాదకీయంలో రాశారు. ఇది యాజమాన్య కోణం. కాని, కొంత కాలంగా పాఠకులుగా మేము చాలా సూచనలు చేశాము. వాటిలో కొన్నిటిని మీరు గౌరవించి కొన్ని మంచి మార్పులు చేశారు. చందమామలో చివరన వస్తున్న ఆ 10 లేదా 12 పేజీల విషయాన్ని పాఠకులుగా మేం కోరుకోవటం లేదు.
– డి.ఎస్. శంకర్, వక్కలంక, ఆంధ్రప్రదేశ్

జూలై సంచికలో వచ్చిన 'పొట్టిపిచుక' కథ 1947లో ఒక చోట వాడిన 'దొంగ ముండ' పదం ఆ కాలంలో ఆమోదనీయమే కావచ్చు. మారుతున్న కాలానికి అనుగుణంగా దాన్ని సంస్కరించి ఉండాలి. – శ్రీలేఖ, హైదరాబాద్

## మధురమైన బాల్యంలో కొన్ని చేదునిజాలు

- ప్రపంచ వ్యాప్తంగా 20% పైగా పిల్లలు ఆల్కహాలిజంతో తల్లడిల్లుతున్న కుటుంబాలలో కృంగిపోతూ పెరుగుతున్నారు.
- 50% నుండి 60% మంది ఆల్కహాలిక్‌లు ఆల్కహాలిక్‌ల పిల్లలే!
- పిల్లల పట్ల శరీర / లైంగిక హింస కేసులలో నమోదయ్యే నేరస్థులు 90% మంది ఆల్కహాలిక్‌లే!
- **ఆల్కహాలిక్‌ల పిల్లలు ఆల్కహాలిక్‌లుగా మారే అవకాశం, ప్రమాదం, ఇతర పిల్లల కంటే రెట్టింపు అని ఋజువైంది.**
- బడిలో, కాలేజీలో ఆల్కహాలిక్‌ల పిల్లలు ఇతర పిల్లలకంటే సమస్యాత్మకంగా వ్యవహరిస్తూ, మానసిక, ప్రవర్తనాపర సమస్యలతో కాలం వెళ్ళదీస్తుంటారు.
- పలురకాల కారణాలతో బడి నుండి బహిష్కరించబడ్డ పిల్లలలో చాలామంది ఆల్కహాలిక్‌ల పిల్లలే.
- ఆల్కహాలిక్‌ల పిల్లలు చాలా శాతం పెరిగి పెద్దయ్యాక కూడా ఉద్యోగ-ఉపాధి పరిధిలో, వైవాహిక జీవితంలో తమ బాధ్యతలను సక్రమంగా, స్థిరంగా నిర్వర్తించలేక విఫలులవుతారు. వీరి జీవనగతిలో స్థిరత్వం లోపిస్తుంది.
- **ఒక వ్యక్తి తాగుబోతుతనం అతడి భావితరాన్ని ఎన్నో విధాల విధ్వంస కారకంగా ప్రభావితం చేస్తుందని చెప్పటానికి ఆల్కహాలిక్‌ల పిల్లల దయనీయ జీవితాలే నిలువెత్తు ఋజువు.**

## 'ఆవిష్కరణ' ఆల్కహాలిక్‌ల పిల్లలు - ఒక అవగాహన

**ఈ పుస్తకం చదివితే మీరు....**

- ఆల్కహాలిజం దుష్ప్రభావాల గురించిన మౌలిక సమాచారాన్ని తెలుసుకుంటారు.
- ఆల్కహాలిక్ యొక్క, అతడి త్రాగుడు కారణంగా వ్యధ చెందే అతడి భార్య పిల్లల యొక్క ప్రవర్తనలు వ్యాధికోణం నుంచి విశ్లేషించగల్గుతారు.
- ఆల్కహాలిక్ కుటుంబీకుల జీవన విధానం, వారి పిల్లల మనోస్థితి గురించి ఎన్నో బాధాకరమైన సత్యాలను వెలికి తీయగల్గుతారు.
- విద్యాసంస్థలు, డాక్టర్లు, సంఘసేవకులు మొదలైనవారు ఆల్కహాలిక్‌ల పిల్లలను గుర్తించి సాయపడగల్గుతారు.
- 'ఆల్కహాలిజం' తీరు తెన్నులను బలహీనత, నేరము, పాపము, వ్యసనము, ఇవేవీ కాకుండా 'కుటుంబవ్యాధి' అనే శాస్త్రీయ దృష్టితో అవలోకించ గల్గుతారు.

## 'బుజ్జి' (చిత్రకథ)



అతిగా తాగే తండ్రి పరిస్థితిని అర్థం చేసుకోలేని లేత వయసులో భయాందోళనలతో తల్లడిల్లే ఒక పసిమనసు చిత్రానుభూతి 'బుజ్జి' పిల్లలకు సైతం అర్థమయ్యే సరళమైన తెలుగులో, వారికే గాకుండా, పెద్దలకు కూడా 'ఆల్కహాలిజం' గురించి మౌలికమైన అవగాహన కల్పించే హృద్యమైన పుస్తకం .

ఈ రెండు పుస్తకాల చివర్న ఆంధ్రప్రదేశ్‌లోని డి-ఎడిక్షన్ సెంటర్ల చిరునామాలు, ఎ.ఎ, ఆల్-ఎనాన్ సమావేశాల చిరునామాలు, వివరాలు పొందుపరచబడి ఉన్నాయి. ఆల్కహాలిజం అవగాహనకు ఉపకరించే ప్రశ్నావళి శీర్షికలు జతచేయబడ్డాయి.

# చందమామతో నా జ్ఞాపకాలు – 1

నా పేరు డొక్కా సోమ శంకరం. మాది తూర్పు గోదావరి జిల్లా, అంబాజీపేట మండలంలోని వక్కలంక అనే చిన్న గ్రామం. నావయస్సు 65 సంవత్సరాలు. రమారమి 6 సంవత్సరాల వయస్సు నుండి చందమామ చదువుతున్నాను. ఆ రోజుల్లో మా ఇంటిలో వంట మనిషి ఉండేవాడు. మద్రాసు నుండి శెలవులకు వచ్చే మా మేనత్తల, అక్కయ్యల దగ్గర చందా కట్టాలని పావలా, అర్థరూపాయి (అప్పుడు సంవత్సర చందా రూ. 4 – 8 అణాలు) వసూలు చేసి తన పేరు మీద చందా కట్టేవాడు. ఆ చందా నెంబరు కూడా టి.సి.ఎస్ 3166 అని బాగా గుర్తు.

ప్రతీ నెల 2, 3 తారీఖులలో పోస్టాఫీసుకు (ప్రక్కఇల్లే) వెళ్లి కాచుకొనేవాడిని. సంచివిప్పి బోర్లించగానే చందమామ కిందకు పడితే ఎంతో సంతోషం కలిగేది. చందమామ రాగానే ముందుగా జానపద సీరియల్స్ చదివేసేవాడిని. ఆ క్రమంలో బేతాళ కథలు, పౌరాణికసీరియల్స్‌కు ప్రాధాన్యత ఇచ్చేవాడిని. కంచుకోట సీరియల్ వస్తున్న సమయంలో అవి రాస్తున్నవి శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం అని తెలిసి వారి పేర ఉత్తరం రాస్తే ఆప్యాయంగా జవాబు ఇచ్చారు. అలా ఉత్తర ప్రత్యుత్తరాలు అవుతుండగా మద్రాసు వచ్చి ఆఫీసులో కలవమని ఆయన అడగటం నేను వెంటనే వెళ్లి ఆయనను కలవడం జరిగింది.



Name: D.Soma Sankaram
Occupation: Cultivation
Place: Vakkalanka, Ambajipeta.

చందమామ పాత సంచికలు మళ్లీ చదవాలన్న నా కోరికకు ఆయన స్పందించి తన ప్రక్కన కుర్చీ వేయించి సంవత్సరపు బైండ్లు (12 నెలలు ఒక బైండుగా ఉండేది) ఇస్తే సాయంత్రం దాక అక్కడే ఉండి చదువుకునే వాడిని. మధ్యలో పిచ్చాపాటీ, కాఫీ వగైరా సరేసరి. ఇలా కనీసం 4, 5 సార్లు ఆయనతో కూర్చుని సత్ కాలక్షేపం చేసే అదృష్టం దక్కింది. వారి సీరియల్స్ గురించి సలహాలు, విమర్శలు చేసే సాహసం ఉత్తరాల ద్వారా చేస్తే సహృదయంతో స్వీకరించారు. ఆ ఉత్తరాలలో కొన్నింటిని ఈ మధ్య రచన మాస పత్రికలో (దాసరి వారి స్మృతి సంచిక) ప్రచురించారు.

చందమామ రాగానే జానపద సీరియల్, పౌరాణిక సీరియల్ విడిగా తీసి అవి పూర్తి అయ్యాక బైండ్ చేయించుకొనేవాడిని. పునఃప్రచురణకు నోచుకొన్నప్పుడు కూడా మళ్లీ వాటిని బైండ్ చేయించుకోవడం, దాచుకొని మళ్లీ మళ్లీ (ఎన్నిసార్లో చెప్పలేను) చదువుకోవడం జరిగింది. కొన్ని సంవత్సరాల క్రితం చందమామకు గ్రహణం పట్టి కొన్ని నెలలు రాకపోతే విపరీతంగా బాధపడిన పాఠకులలో నేను ఉన్నాను. 'ఒక్కమాటు ఆ విచిత్ర కవలలు సీరియల్ ఇవ్వవోయి' అని నాకు చదువు చెప్పిన గురువుగారు అడిగితే 'మా ఇంట్లో కూర్చుని చదువుకోవాలి తప్పితే ఇంటికి ఇవ్వను' అని నిష్కర్షగా చెప్పిన సందర్భాలు ఉన్నాయి.

ఈ మధ్యనే చందమామ పిచ్చోళ్ల సంఘం ఒక్కటి ఉందని తెలిసి ఎంతో సంతోషం అయింది. అలానే కొంతమంది దగ్గర చందమామలు తొలి సంచిక నుండి ఉన్నాయని విని 'ఆహా ఏమి అదృష్టవంతులు నేను ఈ జాగ్రత్త చేయలేకపోతినే' అని పుట్టెడు దుఃఖంలో మునిగిపోయాను కూడా. నాలాంటి అభిరుచి ఉన్నవాళ్లను కల్సినప్పుడు 60లలో చందమామలా మళ్లీ వస్తేనూ, రూపధరుడి సాహసయాత్రలు, ఐదు ప్రశ్నలు వగైరా మళ్లీ ప్రచురిస్తేనూ ఎంత బాగుంటుంది అని చర్చించుకోవడం చేస్తుంటాము.

'మీరు ఇంకా చందమామ చదువుతున్నారా' అని అడిగిన కొంతమందిని మింగేసేలా చూసి 'నేను బతికినంత కాలం చదువుతూనే ఉంటాను, మీకేమైనా అభ్యంతరమా' అని అడిగేసేను కూడా, ఈ మధ్య చందమామలోని మార్పులను తట్టుకోలేక వరుసగా విమర్శన లేఖలు ఎన్నో రాశాను. నాలాగే చాలా చాలామంది అభిప్రాయపడుతున్నట్లుగానూ తెలుస్తూనే ఉన్నది. సైజు మార్పు, కథలు తగ్గి ఆసక్తి కలిగించని శీర్షికలు ఎక్కువ కావడం నచ్చడ లేదు. సైజును మామూలు చేసినట్లే కథలను పెంచాలన్నది నా కోరిక, చందమామ చిరంజీవత్వం పొందాలని, మా తరం పాఠకులను (పూర్వం లాగా తయారై) అలరిస్తూనే ఉండాలని ప్రగాఢంగా ఆకాంక్షిస్తున్నాను.

# చందమామతో నా జ్ఞాపకాలు – 2

అవి 1970ల చివరి రోజులు. అప్పట్లోనేను పాఠశాల విద్యార్థిని. ఒకరోజు అంగట్లో సరుకులు కొన్న తర్వాత నేను ఇంటికి తిరిగి వస్తున్నాను. ఒక చిన్న కొట్టులో అంబిలి అమ్మావన్ – మళయాళ చందమామ– పత్రికను చూసాను. చూడగానే దాన్ని కొనాలనుకున్నాను. కాని నావద్ద తగినంత డబ్బు లేదు. అందుకని ఇంటికెళ్లి డబ్బులతో తిరిగొస్తానని అంగడి యజమానికి చెప్పి, ఒక ప్రతిని నాకోసం ఉంచమని చెప్పాను. సరిగ్గా ఇరవై నిమిషాలలోపే నేను తిరిగొచ్చాను. కాని అక్కడ అంబిలి అమ్మావన్ పత్రిక కనపడలేదు. దుకాణాదారు అప్పటికే మరెవరికో దాన్ని అమ్మేశాడు.


Name: T.R. Joseph
Place: Ernakulam, Kerala.

చేసేదేమీ లేకనేను మళ్లీ ఇంటికి తిరుగుముఖం పట్టి పత్రిక గురించి నాన్నకు చెప్పాను. నా ఆరాటం గమనించిన నాన్న అక్కడికి అయిదు కిలోమీటర్ల దూరంలోని పెరుంబవూర్ లోని ఒక దుకాణం నుంచి దాన్ని తెప్పించాడు. పత్రిక చేతికలో పడగానే మహదానందపడ్డాను.

అంబిలి అమ్మావన్‌లో నాకిష్టమైన సీరియల్ 'వీర హనుమాన్' తర్వాత కొన్నాళ్లకు పత్రికకు చందాదారుడినయ్యాను. దశాబ్దాలకు పైగా పాఠకుల ఆదరణ పొందుతూ వస్తున్న అంబిలి అమ్మావన్‌కి  నా హృదయ పూర్వక శుభాకాంక్షలు.

బేతాళ కథలు

# మాట తప్పని మహారాజు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా! నువ్వు నిశీధి సమయాన ఏ స్వార్థ ప్రయోజనమాశించి ఇక్కడ సంచరిస్తున్నావో నాకు తోచడం లేదు. ఇంత కష్టాన్ని ఎందుకు కొని తెచ్చుకుంటున్నావో నాకు అర్థం కావడం లేదు. కొంతమంది తెలివిహీనులు తమ స్వంత కృషి, ప్రతిభలతో కూడా జీవితంలో ఘనకార్యాలు సాధిస్తారు. తర్వాత మనసులో ఏవేవో ఊహించుకుని భయంతో వాటికి దూరమవుతారు. ఈ సందర్భంగా తన తెలివితేటలతో ఒక రాజ్యాన్ని కైవసం చేసుకోగలిగిన అవకాశం వచ్చినప్పటికీ, భీరువులా కనిపించకపోయిన యజ్ఞవల్కుడు అనే పండితోత్తముని కథ చెబుతాను. శ్రమ

తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు.

అవంతి రాజ్యం రాజు నయనకాంతుడు సత్య సంధుడు, పరాక్రమశాలి. అతనికి ప్రజల్లోనే కాక సాటి రాజుల మధ్య కూడా మంచి పేరుంది. అతడిని అందరూ మాట తప్పని మహారాజు అని పిలిచేవారు.

నయనకాంతుడు ఒక పర్యాయం వేటకు వెళ్ళినప్పుడు ఒక సర్పం అతని కన్నుల్లో విషం చిమ్మింది. అందువలన అతడు దృష్టిని కోల్పోయాడు.

అతడు మరలా దృష్టిని పొందడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అవేవీ ఫలించ లేదు. ఆ విషయమై అతడు చింతాక్రాంతు డయ్యాడు.

చివరి ప్రయత్నంగా నయనకాంతుడు తనకు దృష్టిని తెప్పించిన వారికి లక్ష బంగారు కాసుల వరకు కానుకగా ఇస్తానని ప్రకటించాడు.

అప్పుడు యజ్ఞవల్కుడు అనే పండితుడు మహారాజుని కలిసి, 'మహారాజా! అనేక తాళ పత్ర గ్రంథాలు చదివి మీకు దృష్టిని రప్పించడానికి ''నేత్ర ప్రదాన'' అనే వైద్య ప్రక్రియను కనుగొన్నాను. ఆ ప్రక్రియకు అవసరమైన మూలికలు, ఔషధుల కోసం నైమిశారణ్యంలో తిరిగి అత్యంత శ్రమతో సంపాదించాను. వాటి సహాయంతో మీకు నెలరోజుల్లో దృష్టిని తెప్పించగలను.అయితే అందుకు ప్రతిఫలంగా మీరు లక్ష బంగారు కాసులకు బదులు, అర్ధ రాజ్యం ఇప్పించాలి,' అని మనవి చేశాడు.

సుదీర్ఘంగా ఆలోచించిన నయనకాంతుడు, 'పండితోత్తమా! దృష్టి లేని జీవితం కంటే అర్ధ రాజ్యం ఏమీ ఎక్కువ కాదు. మీరు నాకు చూపు తెప్పించగలిగితే మీకు అర్ధరాజ్యం ఇస్తాను. అయితే ప్రతిఫలం భారీ మొత్తాన అడిగారు కాబట్టి, నాకు చూపు రాని పక్షాన మీరు శిక్షకు కూడా సిద్ధపడాలి,' అన్నాడు.

'మహారాజా, మీరే శిక్ష విధించినా నేను సిద్ధం,' అని బదులు పలికాడు యజ్ఞవల్కుడు. 'చూపు రప్పిస్తే అర్ధ రాజ్యం. లేకుంటే శిరచ్ఛేదనం' అన్నాడు నయనకాంతుడు. అందుకు యజ్ఞవల్కుడు సమ్మతించాడు.

ఈ విషయం రాజ్యమంతా పాకింది. ప్రజలందరూ యజ్ఞవల్కుడు రాజుగారికి చేసే వైద్యం కోసం ఎదురు చూడసాగారు.

యజ్ఞవల్కుడు ఒకరోజు మంచి ఘడియలు చూసి, మహారాజు గారి చేత శుచిగా స్నానం చేయించి, అతని తలకు వివిధ రకాల తైలాల చేత బాగా మర్దన చేయించాడు. కొన్ని ఆకు రసాలు తాగించి, పిదప అతని కన్నులకు లేపనం రాసి కళ్ళకు కట్టు కట్టాడు.

అలా వారం గడిచింది. ఒకరోజు నయనకాంతుడు సభ తీరుస్తూ, యజ్ఞవల్కుడిని కూడా తనతో పాటు సభకు తీసుకు వెళ్లాడు.

సభలో కొందరు పల్లెకారులు, 'రాజా! ఒక చిరుత పులి మా పల్లెల మీద పడి జనాన్ని చంపుకు తింటున్నది. మీరు దాని పని పట్టాలి' అని వేడుకున్నారు.

అప్పుడు నయనకాంతుడు, తన ప్రక్క నున్న యజ్ఞవల్క్యుడితో, 'నాకు దృష్టి వస్తే అర్థ రాజ్యానికి మీరే రాజు కదా! కాబోయే రాజుగా ఈ సమస్యకి పరిష్కారం చెప్పండి.' అని అడిగాడు.

'దానికేముంది రాజా! మెరికల్లాంటి సైనికులను కొందరిని పల్లెలకు పంపి మాటు వేసి, చిరుతను చంపేలా పథకం వేద్దాం!' అన్నాడు యజ్ఞవల్క్యుడు.

అందుకు మహారాజు మెచ్చుకొని కొందరు సైనికులను పంపి చిరుతను చంపించాడు.

మరో వారం తరవాత మహారాజు సభ తీర్చినప్పుడు కొందరు ధనికులు 'రాజా! గౌరవభైరవుడు అనే గజదొంగ మా సంపద దోచుకుంటూ మాకు కంటిమీద కునుకు లేకుండా చేస్తున్నాడు. వాడిని బంధించే ఏర్పాట్లు చేయండి,' అని కోరారు.

అప్పుడు నయనకాంతుడు, యజ్ఞ వల్క్యుడి వంక 'మీరైతే ఏం చేస్తారు?' అని అడిగాడు. అప్పుడు యజ్ఞవల్క్యుడు 'రాజా! కొందరు వేగులను చిల్లర దొంగలుగా రాజ్యం నలుమూలలకు పంపుదాం. వారు తప్పక గౌరవభైరవుడి దృష్టిలో పడతారు. అతడు వాళ్లను తన ముఠాలో కలుపుకుంటాడు. అప్పుడు మనవేగుల ద్వారా అతడు ఏ ధనికుడి ఇల్లు దోచుకోవడానికి వ్యూహ రచన చేస్తున్నాడో తెలుసుకుని



తేలిగ్గా బంధిద్దాము,' అని చెప్పాడు. మహా రాజు యజ్ఞవల్క్యుడిని ప్రశంసించాడు.

యజ్ఞవల్క్యుడి పథకం ప్రకారం, గౌరవ భైరవుడు ఒక ధనికుడి ఇంట్లో ప్రవేశించి దోచుకోబోతూ, రాజ భటులకు దొరికిపో యాడు.

ఒక రోజు యజ్ఞవల్క్యుడు, మహారాజుకి తైల మర్దనం చేస్తుండగా, ఒక గూఢచారి వచ్చి 'మహారాజా! విదర్భరాజు చంద్రహా సుడు మన రాజ్యం మీదకు దాడి చేయ బోతున్నాడు' అని సమాచారం అందిం చాడు.

నయనకాంతుడు ఆ గూఢచారిని పంపి వేసి, యజ్ఞవల్క్యుడితో, 'ఈ సమస్యను మీరు రాజైతే ఎలా పరిష్కరిస్తారు?' అని అడిగాడు.

అప్పుడు యజ్ఞవల్క్యుడు, నయన కాంతుడి ద్వారా ఇరురాజ్యాల సైనిక బలాల వివరాలు అడిగి తెలుసుకని, 'రాజా! మన సైన్యం కంటే శత్రురాజు సైన్యం రెట్టింపు కాబట్టి అతడితో ప్రస్తు తానికి సంధి చేసుకోవడమే నయం అని భావిస్తున్నాను,' అని చెప్పాడు.

అప్పుడు నయన కాంతుడు 'మనం అలా చేస్తే శత్రురాజుకు కప్పం కట్టాలి. ఆ కప్పం కోసం ప్రజల మీద పన్నులు వేయాలి. ప్రజలు కష్టాల పాలవుతారు. అంతే కాక శత్రురాజు మన రాజ్యప్రజలను బానిసలుగా చూస్తాడు. అంతకంటే శత్రు రాజుతో యుద్ధం చేసి విజయమో, వీర



స్వర్గమో తేల్చుకుంటేనే చాలా మంచిది,' అన్నాడు.

'అయితే యుద్ధానికి సిద్ధపడతారా?' అని అడిగాడు యజ్ఞవల్క్యుడు. 'మీరు నాకు దృష్టి తెప్పిస్తే యుద్ధం తప్పక చేస్తాను,' అన్నాడు నయన కాంతుడు.

'రాజా! రేపటితో నేను మీకు చేస్తున్న వైద్యం ముగుస్తుంది. మీకు తప్పక దృష్టి వస్తుంది,' అని భరోసా ఇచ్చాడు. యజ్ఞ వల్క్యుడు. మరుదినం తైల మర్దనాంతరం యజ్ఞవల్క్యుడు మహారాజు కనులకున్న కట్టుతీసి, 'మహారాజా! మెల్లగా కళ్ళు విప్పి చూడండి' అన్నాడు.

కళ్లు తెరిచిన నయన కాంతుడికి మొదట మసక మసగ్గా కనిపించిన దృశ్యం కొద్ది క్షణాలకు స్పష్టంగా కనిపించింది.

అతడు యజ్ఞవల్కుడిని కౌగిలించు కొని, 'మీరిచ్చిన దృష్టితో శత్రురాజు మీద రెట్టింపు ఉత్సాహంతో పోరు సలుపుతాను. శత్రురాజ్యం వశమైతే అర్ధ రాజ్యం కాదు... విదర్భ రాజ్యాన్ని సంపూర్ణంగా మీకు అప్పగిస్తాను,' అన్నాడు.

యజ్ఞవల్కుడు 'మహారాజా! మీరు మాట తప్పరని తెలుసు. విజయీభవ!' అని ఆశీర్వదించాడు.

నయన కాంతుడు తన రాజ్యం మీదకు దండెత్తివచ్చిన, చంద్రహాసుడిని తన సైన్యంతో ఎదుర్కొన్నాడు. అవంతి సైని కులు రెచ్చిపోయి శత్రుసైనికులను చీల్చి చెండాడారు. అదే అదునుగా నయన కాంతుడు చంద్రహాసుడిని సంహరిం చాడు. తమరాజు నేలకొరిగిన వెంటనే శత్రుసైన్యం పలాయనం చిత్తగించింది. విదర్భరాజ్యం సునాయాసంగా నయన కాంతుడి వశం అయింది.

తను జయించిన రాజ్యాన్ని యజ్ఞవ ల్కుడికి కట్టబెట్టాలన్న కోరికతో నయన కాంతుడు అంతఃపురం చేరాడు. యజ్ఞ వల్కుడి కోసం కబురు పంపితే భటులు, 'రాజా! మీ విజయ వార్త వినగానే పండి తుల వారు ఎవరితో ఏం చెప్పకుండా ఎటో వెళ్లిపోయారు,' అని విన్నవించారు.

నయనకాంతుడు, యజ్ఞవల్కుడి కోసం ఎంత వెదికించినా ప్రయోజనం లేకపోయింది.

ఇంతవరకూ కథ చెప్పిన బేతాళుడు, 'రాజా! మహారాజుకి దృష్టి రప్పించడం ద్వారా అర్ధరాజ్యం సంపాదించడానికి



యజ్ఞవల్కుడు, నైమిశారణ్యంలో మూలికలు, ఔషధులు సేకరించి, తైలాలు, రసాలు తయారు చేసి కష్టపడ్డాడు. అంతే కాదు, భావి రాజుగా మహారాజుకి సలహాలిచ్చి అతడి ప్రశంసలు కూడా పొందాడు. కానీ అర్ధరాజ్యం మాత్రమే కాక పూర్తి రాజ్యం పొందే అవకాశం వచ్చినప్పుడు ఎందుకు పలాయనం చిత్తగించాడు?

మాట తప్పని రాజు మాట తప్పి శత్రు రాజును సంహరించినట్టు తనని కూడా హతం చేయగలడన్న సందేహంతోనా? లేక శత్రురాజ్యాన్ని తన పరం చేస్తే అక్కడి ప్రజలు తన మీద తిరుగుబాటు చేయగలరన్న భయంతోనా?' అని ప్రశ్నించాడు.

అందుకు విక్రమార్కుడు, 'బేతాళా! యజ్ఞవల్కుడు చిన్న విషయాల్లో సలహాలు ఇచ్చాడే కాని యుద్ధప్రస్తావన వచ్చిన సమయాన భీరువులా ప్రవర్తించాడు. మహారాజు విజయమో, వీర స్వర్గమో అన్న నిశ్చయానికి వచ్చినప్పుడు, యజ్ఞవల్కుడు రాజుకి కావలసిన ముఖ్య లక్షణాలు ఏమిటో అవగతం చేసుకున్నాడు.

తను స్వార్థంతో అర్ధరాజ్యం కోరితే, మహారాజు ప్రజల కోసం ప్రాణాలకు తెగించి యుద్ధానికి సిద్ధపడటం అతనిలో మార్పు తెచ్చింది. రాజుకు పదునైన బుర్రతో పాటు ధైర్య సాహసాలు, యుద్ధ కళల్లో ప్రావీణ్యం, ప్రాణ త్యాగానికి సైతం వెరవని నిస్వార్థ బుద్ధి ఉండాలని గ్రహించబట్టే యజ్ఞవల్కుడు తనకు రాజుకి కావలసిన లక్షణాలు లేవని గ్రహించి అంతఃపురం వీడి వెళ్ళిపోయాడు. అంతే గాని, నయన కాంతుడు తనను హతం చేయగలడన్న సందేహంతో గాని, శత్రురాజ్యం ప్రజలు తిరుగుబాటు చేస్తారన్న భయంతో గాని కాదు, అని సమాధానం ఇచ్చాడు.

విక్రమార్కుడి నుంచి సరైన సమాధానం రావడంతో బేతాళుడు తిరిగి చెట్టెక్కాడు.

– కల్పితం

(ఆధారం: ఎన్. శివనాగేశ్వరరావు)



# వివేకం

విజయపుర మహారాజు విజయసేనుడు తన రాజ్యంలో ప్రతిఏడాదీ రాజ్యోత్సవాలు జరిపి, సకల రాజ్యాల వీరులను ఆహ్వానించి అనేక అంశాలలో పోటీలు నిర్వహించి బహుమతులు అందించేవాడు.

ఆ ఏడాది విజయపురంలోని రాజ్యోత్సవాలకు బహుదూర ప్రాంతాల నుండీ మహావీరులు, కళాకారులు హాజరయ్యారు. కత్తిసాము, కర్రసాము, విలువిద్య, కుస్తీ పోటీ, నాట్యం, సంగీతం, చిత్ర లేఖనం, మొదలైన ఎన్నో పోటీల్లో ప్రథమస్థానంలో వచ్చిన మహాపుర రాజ్యవాసి వినయుడు మహారాజు విజయసేనుని దృష్టిని ఎంతగానో అకర్షించాడు. బహుమతి ప్రదాన సమయంలో మహారాజు వినయుని అభినందిస్తూ 'వినయా! ఇంత వీరులైన మీకు మా రాజ్యంలో ప్రముఖ స్థానం కల్పించి, ఉన్నతోద్యోగం ఇచ్చి గౌరవించాలని మా అభిమతం. ఏమంటారు!' అని అడిగాడు.

వినయుడు, మహారాజుకు నమస్కరించి 'మన్నించండి మహారాజా! మీ ఉత్సవాలలో పాల్గొన దలచి వచ్చామేకాని, మీరివ్వజూపే ఉద్యోగం, పదవికోసం మాత్రంకాదు' అని చెప్పాడు.

'వినయా! మీదేశం దుర్భిక్షంతో ఇబ్బంది పడుతున్నట్లు విన్నాం, మీరు మంచి పదవితో, సుఖంగా జీవించే అవకాశాన్ని వదులుకోవడం తెలివైనపని కాదనుకుంటాను' అన్నాడు విజయ సేనుడు.

'మహారాజా! తల్లి అనాకారని, మరో అందమైన స్త్రీని తల్లిగా చెప్పుకుంటామా! మారాజ్యం దుర్భిక్షంతో బాధపడుతున్నదని, మాతృ భూమిని వదలి వచ్చేయమనడం, మంచి భత్యం ఎరచూపడం భావ్యంకాదు మహారాజా! ఈనెల దినాలుగా మేము చెట్లక్రింద ఉండి, ఎండ, వాన, చలి బాధలకోర్చి పోటీల్లో పాల్గొన్నాం, పక్కనే ఉన్న పెద్ద భవంతులలోని మీ ప్రజలు మమ్ము చూస్తూనే ఉన్నారు కానీ, ఎవ్వరూ కనీసం వసతి కల్పించలేదు. మేము మాదేశం నుండీ తెచ్చుకున్న దారి భత్యంతో వండుకుని తిన్నాం. వసతికి ధనం చెల్లించవలసి వస్తే ఎందరో తమ దేశపు ఉత్సవాల్లో పాల్గొనడానికి వెనుకాడుతారు మహారాజా! మనస్సులో మాట చెప్పినందుకు మన్నించి, శలవివ్వండి!' అని నమస్కరించి, నేస్తగాళ్లతో కలసి బయటికి నడిచాడు వినయుడు.

– ఆదూరి హైమవతి






# తీపికి చేదు చెల్లుకు చెల్లు!

కుంభాలపూర్ణం అనే ఓ మోస్తరు గ్రామంలో అనంతుడు అనే యువకుడు ఉండేవాడు. వాడు తెలివైన వాడే కానీ, ఒట్టి బద్ధకస్తుడు. పైగా తన తెలివితేటలతో సులభంగా డబ్బు సంపాదించగలననే అతిశయం కలవాడు.

దాంతో ఎప్పుడూ పోచికోలు కబుర్లు చెప్పు కుంటూ, తన తెలివీ సామర్థ్యాల గురించి గొప్పలు చెప్పుకుంటూ తిరిగేవాడు. వాడికు న్నదల్లా ఒక్క తాతే! తాత వాణ్ణి మంచి మార్గంలో పెట్టాలని ప్రయత్నించినా లాభం లేకపో యింది.

క్రమంగా అనంతుడు ప్రతీదానికిపందేలు కట్టటానికి అలవాటు పడ్డాడు. మొదట్లో ఒకటి రెండుసార్లు పందాలు గెలిచి, డబ్బు సంపాదించటంతో అదే వృత్తిగా చేపట్టి ధన వంతుడై పోవాలని కలలు కనేవాడు. అది మంచిది కాదనీ, కష్టపడి బ్రతకడం మంచి దనీ తాత ఎంత చెప్పినా చెవిన పెట్టలేదు.

ఇలా ఉండగా... ఓరోజు మిత్రులతో మణుగు జిలేబి అరగంటలో తినేస్తానని పది వరహాలకు పందెం కాసాడు అనంతుడు. మిత్రులూ సై అనడంతో పందెం మొదలైంది.

మణుగు తాజా జిలేబి అనంతుడి ఎదురు పెట్టారు. తియ్యటి జిలేబిని ఏకబిగిన తిన సాగాడు అనంతుడు. మొదట బాగానే ఉన్నా, ఆ తియ్యదనానికి మొహం మొత్తసాగింది. ఓ ప్రక్క సమయం అయిపోతోంది.

దాంతో అనంతుడు జిలేబిని రసం పిండి ముద్దగా చేసి, ఆ తియ్యటి ముద్దని గబగబా నోట కుక్కుకుని తినేసాడు. ఆపైన బెల్లం పాకపు రసాన్ని గటగటా త్రాగేసి పందెం గెలి చాడు. అనుకున్న ప్రకారం మిత్రులతనికి పది వరహాలూ ఇచ్చేసారు.

అయితే ఆ రాత్రికి అనంతుడికి కడుపు నొప్పి, విరోచనాలు పట్టుకున్నాయి. రాత్రంతా కడుపు ఈడ్చి కొట్టేసరికి, తెల్లవారే సరికల్లా

యడ్ల ఆదిలక్ష్మి

అనంతుడు తోటకూర కాడలా వేలాడబడి పోయాడు. వాడి తాత కంగారు పడి ఆచారిని పిలుచుకొచ్చాడు. ఆచారి పరీక్షించి, ఏవో కొన్ని ఆకులు నూరి చేదు ముద్దనొకదాన్ని అనంతుడి చేతికిచ్చి తినమన్నాడు. అది సరిగ్గా అనంతుడు పందెం కోసం తిన్న జిలేబి ముద్దంతే ఉంది.

ఆ చేదుకి నాలుక తెగి పడినంత పనవగా, ఏడుపు మొహంతో అనంతుడు ఆకుముద్దని తిన్నాడు. తర్వాత ఆచారి మరేవో చెట్టు బెరళ్ళు నూరి రసం పిండి కషాయం ఇచ్చి తాగమన్నాడు. అదీ అనంతుడు పందెం కోసం తాగిన జిలేబి రసమంతే ఉంది. కాని అది తియ్యగా ఉంటే ఇది కటిక చేదుగా ఉంది.

ఈసారి నిజంగానే ఏడ్చేసాడు అనంతుడు. అయినా తాత బలవంతం మీదా, అనారోగ్యపు బాధ తట్టుకోలేక కళ్ళు మూసుకుని కషాయం తాగేసాడు. ఆ వైద్యం వరసగా మూడు పూటలు నడిచింది. ఆచారి వైద్యం చేసినందుకు గాను పది వరహాలు వసూలు చేసుకుపోయాడు. అనంతుడు నిలువు గుడ్లేసుకు చూసాడు.

వాణ్ణి చూసి తాత నవ్వుతూ 'చూశావురా అనంతా! మనం చేసిన ప్రతీ పనికీ ఫలితం అనుభవిస్తాం. నువ్వు జిలేబి ముద్ద చేసి తిన్నావు, రసం పిండి తాగావు. పందెం గెలిచి నువ్వు సంపాదించిన పది వరహాలు, వైద్యం చేసి ఆచారి పట్టుకుపోయాడు. వెరసి చేదు ఆకుల ముద్ద, పసరు కషాయపు చేదు నీకు మిగిలి పోయింది. తీపి జిలేబికి ఇది చెల్లుకు చెల్లన్న మాట! ఇప్పటికైనా జులాయి పనులు మాని, కష్టపడి పనిచేసుకో. జీవితం సుఖంగా గడుస్తుంది. నా మాట వినరా!' అన్నాడు అనునయంగా.

అనంతుడికి సత్యం బోధపడినట్లయ్యింది. 'వింటాను తాతా! పెద్దల మాట చద్ది మూట అంటారందుకే కాబోలు' అన్నాడు స్థిరంగా.

ఆనాటి నుండి అనంతుడు బద్ధకం వదుల్చుకుని, కష్టపడి పనిచేసి, త్వరలోనే మంచి పేరు తెచ్చుకున్నాడు.

అనంతుడి బుద్ధిమారినందుకు, అతడి తాత గుంభనంగా నవ్వుతూ మీసాలు సవరించుకున్నాడు ఆచారితో కలిసి తను వేసిన పథకం పారినందుకు!





# బెడిసిన పందెం

ఆ గ్రామంలో అతడిని ప్రజలందరూ విసుగులేని వీరయ్య అని పిలుస్తారు. ఎవరు ఏమని చెప్పినా వీరయ్య విసుగు చెందకుండా చేసుకుంటూ పోతాడు. ఎంతటి చిన్నపిల్లవాడు పలకరించినా సరే ఆత్మీయంగా మాట్లాడతాడు. ఒకే విషయం గురించి ఎంతమంది ఎన్ని సార్లు ప్రశ్నించినా సరే, అంతమందికీ ఒకేరకంగా సమాధానం చెబుతాడు తప్ప తను విసుగు ప్రదర్శించనే ప్రదర్శించడు. మాట వరసకైనా వీరయ్యకు కోపం రాదు.

గ్రామస్తులు అతడి చేత పనిచేయించుకుని తమకి తోచినంత డబ్బో, ఆహార పదార్థాలో అతడి చేతిలో ఉంచుతారు. కొంతమంది ఆహార ధాన్యాలు ఇస్తారు. వాటితో వీరయ్య తన కుటుంబాన్ని పోషించుకుంటూ వస్తున్నాడు.

వీరయ్య భార్య మహా విసుగుమనిషి, తన భర్త తీరు ఆమెకెంత మాత్రం నచ్చదు. రాత్రీ పగలూ ఒకే రకంగా కష్టపడుతూ కూడా తన కష్టానికి తగినంత ప్రతిఫలం సాధించడే, అని ఆమె గగ్గోలు పెట్టేది. వీరయ్య ఎంత శాంతమూర్తో అతడి భార్య అంత గయ్యాళి.

ఆమె తన భర్తతో, 'నువు ఇద్దరు మనుషుల పనులు చేస్తావు. ఒకడికిచ్చే పాటి కూలిడబ్బులు కూడా సంపాదించవు. మన పిల్లలు ఎదుగుతున్నారు. నువు తెచ్చే సంపాదన మన కుటుంబానికి ఏ మూలకూ చాలడం లేదు' అంది.

వీరయ్య నవ్వి, ఆమెకు తన ఇంట్లో ఉన్న చెంబును చూపించి, 'ఈ చెంబు చెరువులో అయినా, సముద్రంలో అయినా ఒకే మొత్తంలో నీటిని సంపాదిస్తుంది.

ఎమ్.వి.వి. సత్యనారాయణ



నేనూ ఈ చెంబూ ఒకటే. మనకెంత రావాలో అంతే వస్తుంది తప్ప ఎక్కువ మొత్తంలో లభించాలంటే ఎలా సాధ్యం' అన్నాడు.

అతడి భార్యకు అరికాలి మంట నెత్తి కెక్కింది. చెంబు వూడదీసుకుని దానితో అతడి నెత్తిన ఒక్క పెట్టు పెట్టింది. అతడి తలకు చిల్లుపడి అరచెంబెడు రక్తం నేల కారింది.

అయినప్పటికీ వీరయ్యలో కోపం కల గలేదు. ఎప్పటిలాగానే శాంతంగా చూస్తూ మెల్లగా తన గాయానికి కట్టు కట్టుకు న్నాడు. కోపం తగ్గిన తరవాత ఆమె వేడి జావ అందించింది.

తన భార్యతో, చూశావా, 'నా భాగ్యం ఒక చెంబు దెబ్బ. ఆ దెబ్బనుండి నేను తప్పించుకోగలిగానా!' అన్నాడు.

వీరయ్య భార్యకు అతడినేం చెయ్యాలో అర్థం కాలేదు. కోపం పట్టలేక తన భర్తను గాయపరిచినందుకు ఆమె ఎంతగానో చింతించింది.

ఈలోగా వీరయ్యకు గ్రామ పెద్ద నుండి కబురు తెచ్చాడు గ్రామసేవకుడు.

అతడు వీరయ్యను సమీపించి..., 'మురుగు కాలువలు తవ్వాలి. నిన్ను వెంటపెట్టుకు రమ్మన్నారు గ్రామపెద్ద' అన్నాడు.

తనకు ఎలాంటి గాయం తగలనట్టు గానే భావించి వీరయ్య పరుగుపరుగున పోయి గ్రామపెద్దను దర్శించుకున్నాడు.

వీరయ్య ఇంట్లో జరిగిన తతంగమంతా ఆ ప్రాంతాన్ని పాలించే ప్రభువు చూశాడు. ఆయన తన మంత్రితో పాటు మారు వేషాలు ధరించి తన ప్రజల బాగోగులు పరిశీలిస్తుంటాడు.

వీరయ్య ఇంటి ప్రక్కనుండి వెళ్తూ ప్రభువు ఆ దంపతుల వ్యవహారం గమ నించి ఆశ్చర్యపోయాడు. వీరయ్య ప్రద ర్శించిన అతి శాంతస్వభావం ప్రభువు కంటికి పిచ్చితనంగా తోచింది.

ఏ మనిషైనా మామూలు మానసిక స్థితిలో అంతటి శాంతం, సహనం కలిగి ఉంటాడా? అని ఆలోచిస్తూ.... తన మంత్రితో కలిసి ఆయన గ్రామపెద్దను కలుసుకున్నాడు. మురిక్కాలువ నిర్మా ణంలో, ఆయన వీరయ్య వెంటబడి అత డికీ మిగతా పనివాళ్లకీ తగిన సూచన లందిస్తూ కనిపించాడు.

ప్రభువునూ, మంత్రినీ గుర్తుపట్టలేని గ్రామపెద్ద, వారివంక ఏం కావాలన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాడు. ప్రభువు అతడితో సాధారణ పౌరుడి మాదిరి, 'వీరయ్యకు విసుగుచెందడం కాని, అలసిపోవడం కాని, పనిని వాయిదా వేయడం గాని, తెలియదనుకుంటాను. సాధారణ వ్యక్తికి అటువంటి ప్రవర్తన ఎంతమాత్రం సాధ్యం కాదు' అన్నాడు.



గ్రామపెద్ద నవ్వి, 'అతడు అజ్ఞానికాడు. పిచ్చివాడు అసలే కాడు. మీరు పరదేశస్తులు కాబట్టి, అతడి విషయం తెలియక సహజంగానే ఆ రకంగా మాట్లాడారు. మా వీరయ్య ఎంత తెలివైన వాడో మీరు గుర్తించే అవకాశం లేదు, అన్నాడు.

ప్రభువుకూ, అతడికీ మధ్య మాటా మాటా పెరిగి చివరికి పందెం వేసుకున్నారు. వీరయ్యను పిచ్చివాడిగా నిరూపించకపోతే ప్రభువు అతడి గ్రామాన్ని, చాలా డబ్బు ఖర్చుపెట్టి ఆదర్శగ్రామంగా తీర్చి దిద్దుతామని మాట ఇచ్చాడు.

గ్రామపెద్ద అప్పుడు గాని తన ప్రభువును గుర్తించలేకపోయాడు. తన తప్పు ఒప్పుకుని ఆయన పాదాలమీద పడ్డాడు. ఆయనతోనే అలా పందెం కట్టినందుకు తనను క్షమించమని ప్రార్థించాడు.

ప్రభువు నవ్వి, 'పందెం పందెమే!' అంటూ వీరయ్యను తన వెంట రాజధానీ నగరానికి మంత్రితో పాటు బయల్దేరి చేరుకున్నాడు. తన అంతఃపుర తోటల్లో ఉన్న విశాలమైన ఖాళీస్థలంలో వరిపంట వెయ్యమని వీరయ్యను ఆదేశించాడు. వీరయ్యకు సరైన నారు దొరకలేదు. తీరా మంచి నారు దొరికిన తర్వాత సహాయకులు దొరకలేదు. అయినప్పటికీ వీరయ్య విసుగు చెందకుండా తానొక్కడే కష్టపడి పనిచేసి వరినాట్లు వేశాడు.

తగిన సమయానికి నీరు పెడుతూ, కలుపు మొక్కలు క్రమం తప్పకుండా తొలగిస్తూ, వరిపంట పెంచుతూ వచ్చాడు. అప్పుడప్పుడూ పంటకు నీరందేది కాదు. నూతుల్లోంచి నీరు తోడి వరి చేను తడిపేవాడు.

వరిమొక్కలు బాగా ఏపుగా పెరిగి, కంకులు వేయడం మొదలు కాగానే, ప్రభువు వీరయ్యను పిలిచి, 'వరిపంటను తక్షణం తొలిగించి వేరుశనగ గింజలు

నాటు. మనకు ఇప్పటికే రాజ్యంలో వరి పంట ఎక్కువగా పండింది' అన్నాడు.

మారు మాట్లాడకుండా వీరయ్య తక్షణమే వరిపంటను నాశనం చేసి తిరిగి దుక్కి దున్ని, వేరు శనగ విత్తనం సంపాదించి తానొక్కడే శ్రమపడి నేలలో విత్తనాలు నాటాడు. తిరిగి పంటకు నీరు పెట్టడం, కలుపు మొక్కలు తొలగించడం, ఇతర వ్యవసాయ పనులు చేసుకుంటూ వచ్చాడు.

అయినప్పటికీ వీరయ్య మొహంలో విసుగు గాని, కోపం కాని, ప్రభువు చూడలేకపోయాడు. ప్రభువు అతడిని మరింత పరీక్షించదలిచి, వేరు శనగ పంటను పరీక్షించి, 'అరెరె, శెనగపంట వేయమని చెప్పబోయి వేరుశెనగ అని చెప్పినట్లున్నాను' అన్నాడు. వీరయ్య ఆయన మనస్సు కనిపెట్టి సంతోషంగా నవ్వుతూ ఆయన కోరినట్లు శెనగ పంట వేశాడు. ఈ పర్యాయమైనా వీరయ్య విసుగు చెందుతాడని ప్రభువు ఆశించి తీవ్రంగా భంగపడ్డాడు.

శెనగ పంట వేస్తున్నంతసేపూ వీరయ్య అలసట తెలియకుండా పని చేశాడు. పైగా అతడి మొహం మీద చిరునవ్వు చెరగలేదు.

వీరయ్యతో ప్రభువు, 'ఇలా చీటికీ మాటికీ పంటలు మార్చడం నీకు కష్టంగా లేదూ!' అన్నాడు.

వీరయ్య నవ్వి, 'ప్రభువులు క్షమించాలి. మనకి వరిపంట తినే భాగ్యం ఉంటే అది పండేది. మనకి భాగ్యం లేదు అది పండలేదు. తరవాత విత్తిన వేరుశెనగా అంతే. ఇప్పుడు శనగ పంట తినే భాగ్యం ఉందో లేదో ఇంకా తెలియదు!' అన్నాడు.

ప్రభువు అతడి తెలివికి మెచ్చుకుని, అతడి గ్రామాన్ని ఆదర్శగ్రామంగా తీర్చి దిద్దాడు.

వీరయ్య కుటుంబానికి ఎలాంటి లోటూ లేకుండా ఏర్పాట్లు చేశాడు.

అప్పుడు వీరయ్య ఆయనతో, 'ప్రభూ, నా చేతిపంట నాకెంత భాగ్యం కలిగించిందో చూశారా!' అన్నాడు.





# పంచతంత్ర కథలు

వంచకుడి కథ

కోసలదేశానికి రాజధాని అయిన అయోధ్యానగరంలో సురథుడు అనే మేటి రాజు ఉండేవాడు. ఆయన కింద వందల కొద్దీ సామంత రాజ్యాలు ఉండేవి. ఒకసారి అటవీశాఖా పాలకుడు అతి వేగంగా రాజధానికి చేరుకుని, రాజుతో ఇలా అన్నాడు.

'మహారాజా, వింధ్యకుడు అనే విద్రోహినాయకత్వాన ఆటవిక జాతులన్నీ తిరుగుబాటు చేశాయి. వాళ్ల తిరుగుబాటును అణచటం నావల్ల కాలేదు గనక తమరే ఆ పనికి పూనుకోవాలి'.

అప్పుడు రాజు, తిరుగుబాటును అణచివేసి తిరుగుబాటుదార్లను శిక్షించటానికి తన మంత్రిని, బలభద్రుడనే ప్రజ్ఞాశాలిని పంపాడు.

బలభద్రుడు బయలుదేరి వెళ్లిపోయిన అనంతరం, గ్రీష్మకాలం చివరలో అయోధ్యకు ఒక దిగంబర సన్యాసి వచ్చాడు. అతను అడిగిన వారందరికీ భవిష్యత్తు చెప్పీ, జాతకాలు వేసీ, గుప్తంగా ఉంచిన పేర్లు తెలుసుకునీ కొద్ది రోజులలో నగర వాసులందరి మన్ననలూ పొందాడు.

ఈ సన్యాసిని గురించి చాలా విని, రాజు కుతూహలం కొద్దీ అతన్ని ఒకసారి రాజభవనానికి ఆహ్వానించి, 'అయ్యా, మీరు మనసులో మాట చెప్పగలరట. నిజమేనా?' అడిగాడు.

'నేను ఎన్ని చోట్ల ఏమేమి చేశానో వాకబు చేస్తే మీకే తెలుస్తుంది,' అంటూ సన్యాసి, తాను చేసిన ఘనకార్యాలన్నీ చెప్పి, రాజుకు విస్మయం కలిగించాడు.

మిత్రభేదం-**22**



రాజు ఆ సన్యాసికి దేవిడీ ఆవరణలోనే ఒక మఠం ఉండటానికి ఇచ్చి, అతన్ని రోజూ పిలిపించుకుంటూ ఉండేవాడు.

ఒకరోజు సాయంకాలం సన్యాసి రాజ భవనానికి వచ్చి, 'రాజా నీకొక శుభవార్త చెబుతాను. దేవతలందరూ నన్ను మరీ బలవంతపెట్టగా, నేను ఇవాళ ఉదయం నా భౌతిక దేహాన్ని మఠంలో విడిచిపెట్టి, సూక్ష్మ శరీరంతో స్వర్గానికి వెళ్ళాను. దేవతలు మీ క్షేమ సమాచారాలు అడగమని నాతో అన్నారు,' అన్నాడు.

ఈ మాట విని రాజుకు అంతులేని ఆశ్చర్యం కలిగి, 'మహాత్మా, మీరు స్వర్గానికి ఎలా వెళ్లారు?' అన్నాడు. 'మహారాజా, అది నాకు ఖేలా మాత్రం కాదా? నేను ప్రతిరోజూ స్వర్గానికి వెళుతూనే ఉంటాను,' అన్నాడు సన్యాసి.

రాజు అమాయకత్వం కొద్దీ అయితేనేం, సన్యాసికి గల అనేక శక్తులను ప్రత్యక్షంగా చూసి ఉంటడం చేత అయితేనేం, సన్యాసి చేసిన ఘనకార్యాల గురించి విని ఉండటం చేతనైతేనేం, ఈ మాటలు నమ్మాడు.

ఆయన రాచకార్యాలు మానుకుని, తన రాణి గురించి కూడా లక్ష్యం లేకుండా పోయి, అస్తమానమూ ఆ సన్యాసిని పెట్టుకుని, స్వర్గలోక వార్తలు వివరంగా అడిగి తెలుసుకోసాగాడు.

ఇంతలో, ఆటవిక జాతుల తిరుగుబాటును అణచి, బలభద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను రాజధానిలో అడుగుపెడుతూనే, రాజుగారు సన్యాసి చేతి కీలుబొమ్మ అయిపోయాడని, దర్బారు చెయ్యటం లేదనీ, మంత్రులను కలుసుకోవటం లేదనీ విన్నాడు. అతను రాజభవనం ప్రవేశించి దర్బారు నిర్జనంగా ఉండటం, మంత్రులుండే చోట ఎవరూ లేకపోవటమూ చూశాడు.

ఒక గదిలో రాజూ, సన్యాసీ ఏకాంతంగా కూర్చుని అతనికి కనిపించారు. సన్యాసి రాజుకు ఏదో రహస్యంగా చెబుతున్నాడు; రాజు వికసించిన ముఖంతో సన్యాసి మాటలను గ్రోలుతున్నాడు. ఆయన బలభద్రుడి రాకను గమనించలేదు. తొలి చూపులోనే మంత్రికి పరిస్థితి

అర్థమైపోయింది. అతను మహారాజు ముందు సాష్టాంగపడి, 'మహారాజా, జయం! జయం!' అన్నాడు.

అతను వెళ్ళినపని ఏమయినది కూడా అడగకుండానే రాజు, 'మీకు ఈ మహాత్ముడు తెలుసునా..?' అని సన్యాసిని చూపుతూ అన్నాడు. 'ఎందరో మహాపురుషులుగా తమ శిష్యులను తయారు చేసిన ఈ మహనీయుణ్ణి గురించి తెలియకేం? వీరు తరచుగా స్వర్గానికి కూడా పోయి వస్తుంటారని విన్నాను. నిజమేనా..?' అన్నాడు బలభద్రుడు.

'అందుకు సందేహమా?' అన్నాడు రాజు. తనను గురించి మంత్రి ఇంత గొప్పగా చెప్పినందుకు ఉప్పొంగిపోయి సన్యాసి, మంత్రికి మరింతగా తనపై గురి ఏర్పడేటట్టు చెయ్యాలని, 'కుతూహలం ఉన్నట్టయితే మంత్రిగారు ఆ సంగతి స్వయంగా చూడవచ్చు,' అంటూ తన మఠంలోకి పోయి, తలుపు గడియ పెట్టుకున్నాడు. కొన్ని నిమిషాలు గడిచినాక మంత్రి రాజుతో, 'వారు స్వర్గం నుంచి ఎప్పుడు తిరిగి వస్తారు?' అన్నాడు.

'అంత తొందర దేనికి, వారు భౌతిక దేహాన్ని మఠంలో వదిలి, సూక్ష్మదేహంతో స్వర్గానికి వేంచేశారు' అన్నాడు రాజు.

'అదే నిజమైతే, కట్టెలూ, నిప్పూ తెప్పించండి. నేను మఠాన్ని తగలబెట్టేస్తాను' అన్నాడు మంత్రి.

'దేనికీ?' అన్నాడు రాజు ఆశ్చర్యంతో, 'దేనికని అడుగుతున్నారా, మహారాజా? ఈ కట్టెలాటి శరీరం కాలిపోయిన మీదట, వారు సూక్ష్మ శరీరంతోటే తమ వద్దకు వస్తూ ఉంటారు. అందువల్ల ప్రపంచమంతటా తమ కీర్తి వ్యాపిస్తుంది. ఈ సందర్భంలో మీకు నాగకుమారుడి కథ చెబుతాను' అంటూ మంత్రి ఇలా చెప్పనారంభించాడు.

(ఇంకా వుంది)





# సేవాధర్మం

జమీందారు శివచంద్రుడికి వీర్రాజు, నాగయ్య, భూషణం నమ్మకస్తులైన సేవకులు.

శివచంద్రుడు అప్పుడప్పుడు వారి కష్ట సుఖాలు తెలుసుకుంటూ కావలసిన సహాయం చేసేవాడు.

భూషణం జమీందారు ఆడంబర జీవితాన్ని గమనించేవాడు. ఇటువంటి జీవితం నేనెప్పుడు అనుభవిస్తానా? అని పగటికలలు కంటూండేవాడు.

శివచంద్రుడికి జంబులింగం అన్ని వ్యవహారాల్లోనూ పక్కలో బల్లెంలో విరోధంగా ఉండేవాడు.

ఒక పర్యాయం భూమి పంపంకం విషయంలో ఇద్దరికీ మాటామాటా పెరిగి కొట్లాట వరకూ దారితీసింది. కాలక్రమేణా శివచంద్రుడికి చాలా గడ్డు సమస్యలు ఎదురయ్యాయి. కళ్లముందే తరాలనాటి ఆస్తిపాస్తులు హారతి కర్పూరంలా హరించి పోయాయి. చివరకు తనకు మిగిలినది చిన్న ఇల్లు మాత్రమే.

కొంతకాలం తరువాత శివచంద్రుడు తన సేవకుల భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని తీవ్రంగా ఆలోచించి, ఉన్న ఇల్లును అమ్మి తన ముగ్గురు సేవకులను పిలిపించాడు. 'నా పరిస్థితి తారుమారయ్యింది, ఇంకా నన్ను అంటిపెట్టుకుని ఉంటే మీ బతుకులు తెల్లవారవు. ఇన్ని దినాలు నా సేవకు ప్రతిఫలంగా తలా ఈ సొమ్ము ఇస్తున్నాను. మీ తెలివి తేటలు ఉపయోగించుకుని పిల్లాపాపలతో సుఖంగా జీవించండి'. అని అన్నాడు.

సేవకులు ముగ్గురూ కడు విచారంతో ఆ సొమ్మును స్వీకరించారు.

ఆరుపల్లి గోవిందరాజులు

జమీందారు నుంచి లభించిన డబ్బుతో వీర్రాజు మట్టిబొమ్మల వ్యాపారం ప్రారంభించాడు.

నాగయ్య కలప వ్యాపారం ప్రారంభించాడు.

భూషణం నాలుగు ఆవులు కొని పాల వ్యాపారం ప్రారంభించాడు.

అతి తక్కువ కాలంలోనే వారి వ్యాపారాలు మూడు పువ్వులు ఆరుకాయల్లా రాణించింది.

కొంతకాలం గడించింది.

ఒక దినం భీభత్సకరమైన తుఫాను చెలరేగింది. ఆ తుఫాను ధాటికి ఇల్లు, చెట్లు కూలిపోయాయి. వీర్రాజు బొమ్మలు, నాగయ్య కలప తడిసి పాడై పోయాయి. భూషణం పశువులు వరదలో కొట్టుకు పోయాయి.

ముగ్గురు తిరిగి వ్యాపారం ప్రారంభించడానికి తగినంత పెట్టుబడి లేక వీధిన పడ్డారు.

అది గమనించిన జంబులింగం ఓ చక్కని అవకాశంగా భావించి ముగ్గురితో, 'మీరు నాతో చేతులు కలపండి. మీ పెట్టుబడికి తగినంత ధనసహాయం చేయిస్తాను. తిరిగి మీమీ వ్యాపారాలు ప్రారంభించండి'' అని అన్నాడు.

వీర్రాజు, నాగయ్య జంబులింగం మాటలకు ఎంతో ఉప్పొంగి పోయి అంగీకరించారు. భూషణం మాత్రం తలాడించలేదు. 'నా మానాన నేను కాయకష్టం చేసుకుంటూ జీవించగలను' అని అన్నాడు.

జంబులింగం నుండి ధన సహాయం లభించిన వీర్రాజు, నాగయ్య తిరిగి వ్యాపారం ప్రారంభించి అతి తక్కువ



కాలంలోనే గొప్ప ధనవంతులైపోయారు. భూషణం మునుపటిలాగే దారిద్ర్యంతో కష్టాలు అనుభవించసాగాడు.

భూషణం స్థితిగతులు తెలుసుకున్న జమీందారు భూషణంని చూడాలని బయలుదేరాడు.

జమీందారును చూసిన భూషణం గౌరవపూర్వకంగా ఆహ్వానించి కూర్చోబెట్టాడు. అతడి భార్య పార్వతి చల్ల అందించింది.

జమీందారు మాటల సందర్భంలో, 'నువ్వు చాలా కష్టాల్లో బతుకుతున్నావని తెలిసి నిన్ను చూడవచ్చాను. వీర్రాజు, నాగయ్యలా ఆ జంబులింగంతో నువు కూడా చేయి కలిపి ఉంటే వారిలా వ్యాపారం చేసుకుంటూ సుఖంగా జీవించేవాడివి కదా' అన్నాడు.

భూషణం వినయంగా చేతులు జోడించి 'నేనూ అందరిలా సుఖంగా, గౌరవంగా జీవించాలనే కలలు కంటున్న వాడినే, కానీ అధర్మ పద్ధతిలో వెళ్లడం నా అభిమతం కాదు. సముచితం అంతకన్నా కాదు. ఎలా అంటారా..? ఇన్నాళ్లూ మీ ఉప్పుతిని సుఖంగా జీవించాం. ఆ జంబులింగం నుండి మీరు చాలా కష్టాల పాలయ్యారు. మిమ్మల్ని ఈ స్థితికి తెచ్చిందివాడే. అటువంటి దుష్టుడితో వాళ్ళిద్దరూ స్వలాభాన్ని ఆశించి చేతులు కలిపారు. అటువంటి మీ బద్ధశత్రువుతో నాలాంటి సేవకుడు చేయి కలపడం సేవాధర్మం కాదు!' అన్నాడు.

భూషణం మాటలకు జమీందారు ఒక్కసారి చలించిపోయాడు. ఆనందంతో, 'నువ్వు నా నిజమైన సేవకుడివి. నీలాంటి వాడిని విడిచి ఇక నేను ఉండలేను. నా వెంట నడు. నేనున్నంత కాలం నా ఇంట నాతో పాటు బతుకుదువు!' అన్నాడు.

భూషణం తిరిగి తన యజమాని సేవ చేసే భాగ్యం తనకు లభించినందుకు ఆనందంతో నమస్కరించాడు.





# పరీక్ష

జగపతి అనే ధనికుడు తన ఆస్థులూ, వ్యాపారాలూ చూసి పెట్టేందుకు సరైన వ్యక్తి కోసం వెదుకుతున్నప్పుడు అతని స్నేహితుడు బిక్షపతి పట్నం చదువులు చదివిన తన బంధువు శ్రవణుడికి ఆ ఉద్యోగం ఇమ్మని అడిగాడు. 'అలాగే చూద్దాం. రేపు పంపించు' అన్నాడు జగపతి. అప్పుడే కామరాజనే మరో కుర్రాడు వచ్చి, 'అయ్యా! తమకి పనులు చూసి పెట్టడానికి మనిషి కావాలని తెలిసింది. పెద్ద చదువులు లేకపోయినా, చెప్పింది చేయగలనన్న నమ్మకం ఉంది. నాకు పని ఇప్పించండి' అని ప్రాధేయపడ్డాడు. జగపతి 'రేపు వచ్చి కనపడు' అని చెప్పి అతణ్ణి పంపించివేశాడు.

మరుసటి రోజు శ్రవణుడు, కామరాజు వచ్చాక జగపతి వారిని తన యింట పెరట్లోకి తీసుకు వెళ్లి 'ఇక్కడ మా తాతలు దాచిన బంగారం ఉందంటారు. ఇప్పటికే నాలుగు మూలలూ తవ్వించాను. ఈ మధ్యనే సిద్ధాంతి ఒకడు వచ్చి ఈశాన్య – నైరుతి మూలల్లో కూడా ఒక మారు తవ్వి చూడ మన్నాడు. మీరిద్దరూ చెరోమూలకీ వెళ్ళి తవ్వించండి' అన్నాడు.

శ్రవణుడు 'చేయవలసిన ఉద్యోగం ఏమిటి? చదువుకున్న నాలాటి వాడికీ పరీక్ష ఏమిటి?' అని గొణుక్కొంటూ ఈశాన్య మూలలో తవ్వటం మొదలు పెట్టాడు. కామరాజు ఏం మాట్లాడకుండా నైరుతి మూలలో తవ్వటం ప్రారంభించాడు.

కొంత సేపయ్యాక జగపతి శ్రవణుడి దగ్గరికెళ్ళి 'ఏమైనా ఫలితం కనబడేటట్టుందా' అని అడిగాడు. శ్రవణుడు అసహనంగా, 'గంటలు గడుస్తున్నా తవ్వుతున్న కొద్దీ మట్టి బురద మాత్రం బైటకు వస్తున్నాయి. ఇక్కడ ఏం బంగారం పండటానికి ఆస్కారం లేదు. నేనే వచ్చి చెబుదామను

జొన్నలగడ్డ రత్న

కుంటున్నాను' అన్నాడు. 'అలాగనా' అంటూ జగపతి కామరాజు దగ్గరకు వెళ్లి, 'శ్రమణుడు అక్కడ మట్టీ బురదా తప్ప మరేమీ లేదంటున్నాడు. నువ్వేమంటు న్నావు' అన్నాడు. కామరాజు వినయంగా 'నేను తవ్వుతున్నది మీరు బయటకు తీయ మన్న బంగారం గురించి కదా? అదింకా కనపడలేదు. తవ్వుకుంటూ పోతున్నాను. మట్టీ బురదా బయటికొస్తున్నదని నేను గమనించనేలేదు' అన్నాడు.

జగపతి నవ్వి 'తవ్వింది చాలు. ఇక ఆపేయ్' అని వెళ్ళిపోయాడు. తరువాత అతడు స్నేహితుడు భిక్షపతిని పిలిచి 'నువ్వేం అనుకోకు. నేను కామరాజుని పనిలో పెట్టు కుందామనుకుంటున్నాను' అన్నాడు.

బిక్షపతి ఆశ్చర్యపడి 'నేను పంపించిన శ్రవణుడికి కామరాజు కన్న ఏమి తక్కు వని వద్దన్నావు' అని అడిగాడు.

అందుకు జగపతి 'కుర్రవాళ్ళిద్దరికీ భూమిలో గుప్తంగా దాచిన బంగారాన్ని తవ్వి తీసే పనొకటి అప్పచెప్పాను. ఆ ప్రయత్నంలో నువ్వు పంపిన శ్రవణుడికి బంగారం కన్నా బయటపడుతున్న మట్టీ బురదా మాత్రమే కనబడ్డాయి. బంగారం దొరికే దాకా తవ్వటానికి సహనం కూడా ఉన్నట్లు లేదు. కామరాజుకి మాత్రం తాను తవ్వి తీయాల్సింది బంగారం కనుక దాని మీదనే దృష్టంతా ఉన్నది. అది బయటకు తీయటం కోసమే శ్రమ పడ్డాడు. బురదా మట్టీ మాత్రమే వస్తున్నాయన్న ధ్యాస ఏ మాత్రం కలగలేదు. నేను చెప్పినట్టుగా బంగారాన్ని వెలికి తీయాలన్నదే అతడు లక్ష్యంగా పెట్టుకున్నాడని తెలిపోయింది. లక్ష్యసాధనకి విద్యార్హతతో పనిలేదు. చేయ మన్నపని శక్తివంచన లేకుండా చిత్తశుద్ధితో చేయటానికి ప్రయత్నించగలడనే కామ రాజుని ఎంచుకున్నాను. నిజానికి నేను తవ్వమన్న చోట బంగారమేదీ దాచలేదు. నేను పెట్టింది పరీక్షే. అందులో కామరాజు నెగ్గాడు,' అన్నాడు. బిక్షపతి జగపతిని 'నీ నిర్ణయం సరైనదే' అంటూ అభినందించి వెళ్ళిపోయాడు.






# బద్ధకపు గాడిద

ఒక ఊరిలో చెన్నయ్య అనే వ్యక్తి నివసిస్తూండేవాడు. అతనికి అనేక వ్యాపారాలున్నాయి. అతను కష్టజీవి. కష్టపడి పనిచేసి ఎంతో ధనం కూడబెట్టాడు. అతని వద్ద కొన్ని గాడిదలు ఉన్నాయి. వాటిని నిత్యం అతను తన వ్యాపార అవసరాలకు ఉపయోగించుకునేవాడు.

అతనికున్న గాడిదలలో ఒక గాడిద మహా బద్ధకస్తురాలు. దానికి పని అంటే అస్సలు ఇష్టం ఉండదు. అది పని చేయకపోగా పని చేస్తున్న తోటి గాడిదలను సైతం తన మాటలతో చెడగొట్టేది.

ప్రతిరోజూ చెన్నయ్య పొలం నుండి గడ్డికోసుకుని ఆ మోపుని గాడిదలపై వేసుకుని వాటిని అమ్మి డబ్బుచేసుకునేవాడు. గడ్డి మోపును మోస్తున్న బద్ధకపు గాడిద తన తోటి గాడిదలతో ఇలా అనేది. 'అబ్బా, ఎంత కష్టమైన పని ఇది. మొయ్యలేక చస్తున్నాను. నన్ను మన యజమాని వేరే పనిలో వేస్తే బాగుండు' అని అనేది.

ఒక రోజు ఇది విన్న దాని యజమాని ఆ గాడిదని తీసుకెళ్లి తనకున్న కట్టెల వ్యాపారంలో పడేశాడు.

వారం రోజులు గడిచాయి. 'అబ్బా, ఈ పని ఇంకా కష్టంగా ఉంది. చెయ్యలేక చస్తున్నాను. రోజూ అన్నన్ని కట్టెల మోపులను ఎలా మోస్తున్నారు మీరు?' అని తన తోటి గాడిదలను ఆశ్చర్యంగా ప్రశ్నించింది బద్ధకపు గాడిద.

ఒకరోజు అది మళ్ళీ తోటి గాడిదలతో ముచ్చటిస్తూ, 'అబ్బా నా యజమాని నన్ను ఇక్కడి నుంచి వేరేపనిలో వేస్తే బావుండు. ఈ బరువులు మోయడం నా వల్ల కావడం లేదు' అని బద్ధకంగా ఒళ్ళు

శిష్టి శేషగిరి

విరుచుకుంది. గాడిదమాటలు విన్న వెంటనే యజమాని దాన్ని తీసుకెళ్ళి తన ఇసుక వ్యాపారంలో పడేశాడు.

కొన్నాళ్ళకు గాడిద మళ్ళీ పాతపాటే ఎత్తుకుంది. 'అమ్మో నా వల్ల కాదు బాబూ. ఈ బరువులు మోయడం. అసలు ఎలా మోస్తున్నారు మీరంతా ఇంత బరువులని? ఇక్కడికొచ్చాక వారంరోజులకే నా ఒళ్ళు హూనం అయింది' అని సాటి గాడిదలతో తన అవస్థని చెప్పుకుని విచారించింది బద్ధకపు గాడిద.

ఇక అక్కడ కూడా ఉండలేక ఒకనాడు 'అబ్బా! నా యజమాని నన్ను ఇక్కడి నుండి వేరే పనిలో వేస్తే బావుండు కదా!' అన్నది పక్కనున్న గాడిదతో బద్ధకంగా.

అది విన్న పక్కగాడిద వెంటనే ఇలా అంది. 'ఉష్ గట్టిగా ఆమాట అనకు. మన యజమాని వింటే నీతో పాటు నన్ను కూడా తీసుకెళ్ళి ఆ పనిలో వేస్తాడు' అంది భయంగా.

'పడేయనీ, కనీసం అక్కడైనా హాయిగా ఉంటుందేమో' అన్నది గాడిద అమాయకంగా.

'ఓసి పిచ్చిమొహమా... మన యజమాని చేసే చివరి వ్యాపారమేంటో తెలుసా?' అని అడిగింది పక్కనున్న గాడిద నెమ్మదిగా.

'ఊహు, తెలీదు' అన్నది బద్ధకపు గాడిద.

'మాంసం మరియు చర్మ వ్యాపారం. ఇక్కడ పనిచెయ్యని, పనికిరాని గాడిదలను చంపి, వాటి చర్మాన్ని ఒకచోట, మాంసాన్ని ఒక చోట అమ్మేస్తాడు' అంది పక్కగాడిద అసలు విషయం చెబుతూ.

అంతే.. అది విన్న బద్ధకపు గాడిదకు ఒంట్లో దడ పుట్టింది. దానిలోని బద్ధకం కాస్తా వెనువెంటనే మటుమాయమైంది. అప్పటినుండి అది తన పనిపట్ల ఎలాంటి వంకలూ పెట్టకుండా బుద్ధిగా, శ్రద్ధగా పనిచేయసాగింది.






# రఘువంశం

దిలీప మహారాజు పట్టమహిషి పేరు సుదక్షిణాదేవి. ఆ దంపతులకు సకల సంపదలూ ఉన్నాయి కాని సంతానం లేదు. అందువల్ల ఆయన భార్యసమేతుడై గురువైన వశిష్ఠ మహాముని వద్దకు పోయి, తనకు వంశం నిలబడే యోగ్యత ఉన్నదో లేదో చెప్పమని కోరాడు.

వశిష్ఠమహాముని వద్ద నందినీ ధేను వనే గోవు ఒకటి ఉంది. ఈ గోవు సామాన్యమైనది కాదు. కామధేనువు యొక్క పుత్రిక. 'నీవూ, నీ భార్యా కలిసి ఈ గోవును కొన్నాళ్లు భక్తి శ్రద్ధలతో సేవించినట్టయితే, మీ కోరిక తీరుతుంది' అని దిలీపునికి సలహా చెప్పాడు. వశిష్ఠమహర్షి.

రాజూ, రాణీ రోజూ ఉదయమే లేచి స్నానం చేసుకొని తరవాత ఆ గోవును పువ్వులను పూజించేవారు. దూడ పాలు తాగి విడిచిన పిమ్మట రాజు ధేనువును అడవులమ్మట మేతకు తోలుకువెళ్లేవాడు. దానికి ఏ అపాయమూ రాకుండా కంటికి రెప్పలాగ కాపాడేవాడు. సాయంకాలం వరకూ మేపి ఇంటికి తోలుకు వచ్చేవాడు. ఇలా ఆ భూపాలుడు గోపాలుడై ఇరవెయ్యొక్క రోజులు గడిపాడు.

ఇరవై రెండో రోజున యధాప్రకారం రాజు నందినీ ధేనువును తోలుకెళ్ళాడు. అది ఆనాడు హిమవత్పత పర్వతాలవైపు దారి తీసింది. ఆ మహా పర్వతాల ఎత్తూ, గాంభీర్యమూ, అందమూ తదేకంగా చూస్తూ... క్షణకాలం రాజు ధేనువును మరిచాడు. ఆలోగా అది ఒక గుహలో పలికి ప్రవేశించింది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




వెంటనే ఏదో ఆపదలో చిక్కుకున్న దానికి మల్లే అది దీనంగా 'అంబా' అని గట్టిగా అరిచింది. ఈ ఆర్తనాదం వినటంతో రాజు ఉలిక్కిపడి గోవును వెతుకుతూ పరిగెత్తుకుంటూ పోయి ఆ గుహలోకి అడుగు పెట్టాడు. గోవుపైన ఒక సింహం ఎక్కి కూర్చుని దానిని భక్షించటానికి సిద్ధంగా ఉన్నట్టు కనబడింది. వెంటనే రాజు అమ్ములపొదిలో చెయ్యి పెట్టి బాణం తీయబోయాడు.

ఏమి చిత్రమో కాని ఆ చెయ్యి స్తంభించిపోయి, అతడు బాణం తీయనేలేక పోయాడు. ఆశ్చర్యంతో, కోపంతో నిలబడి ఉన్న రాజుతో ఆ సింహం మానవ భాషలో మాట్లాడజొచ్చింది.

'లాభం లేదు. ఒక వేళ నువ్వు నా మీద బాణం వేయగలిగినా అది నన్నేమీ చెయ్యలేదు. ఏమంటే నేను శివునికి పరమాప్తుడైన కుంభోదరుణ్ణి! ఆయన ఎద్దునెక్కేటప్పుడు నా వీపుమీద అడుగు పెట్టి మరీ ఎక్కుతాడు. ఆయనే నన్ను సింహంగా మార్చి ఇక్కడ కాపలా పెట్టాడు. ఇక్కడకు వచ్చిన ఏ జంతువునైనా సరే పట్టుకు తినే హక్కు కూడా ఆయనే ఇచ్చాడు...'

'అటు చూడు, ఆ దేవదారు మొక్కను. దాన్ని పార్వతీదేవి సరదాగా పెంచింది. ఒకనాడు అడవి ఏనుగు ఒకటి ఆ చెట్టును పెట్టి ఒళ్ళు రాసుకుంది. దానితో అంతమేరా చెట్టు బెరడు ఊడి చక్కాపోయింది. అప్పుడు పార్వతీదేవి చాలా విచారించింది. అందుకోసమే పరమేశ్వరుడు ఆ చెట్టు పాడు కాకుండా నన్నిక్కడ ఈ రూపంలో కాపలా పెట్టాడు. ఇదీ కథ. నువ్వు ఇంక చేయగలిగినదేమీలేదు. ఈ గోవు ఆయువు నేటితో మూడింది. దీన్ని భక్షించి నా ఆకలి తీర్చుకుంటాను. కనుక నీ దారిని నువ్వు వెళ్ళవచ్చు' అని చెప్పింది.

ఐతే, దిలీప మహారాజు కదలలేదు. 'శివుని ప్రభావం వల్లనే నా హస్తం స్తంభించి పోయిందన్నమాట! అందువల్ల ఈ గోవును నేను నా బాణాలవల్ల కాపాడలేను. కాని దీనికి బదులుగా నేనే నీకు ఆహారమవు

తాను. దీనిని వదిలెయ్యి. పాపం, దీని దూడ ఆకలితో పాలకోసం నకనకలాడుతూ ఉంటుంది. ఆ లేగమీదనైనా దయదలిచి ఈ గోవును వదిలెయ్యి. మా గురువైన వశిష్ట మహామునికి ఇది లేకపోతే ఆయన చాలా ఇబ్బంది పడిపోతాడు' అన్నాడు.

ఈ మాటలు విన్న సింహం వికటంగా నవ్వుతూ, 'చూడగా మూర్ఖునికి మల్లే ఉన్నావే? ఈ ఆవు లేకపోతే నీ గురువు ఇబ్బందిపడతాడని తోస్తే దీనికి బదులు ఆయనకు కోటానుకోట్ల గోవులను ఇయ్యగల సమర్ధత ఉంది నీకు. అలాంటిది ఒక్క ఆవుకోసం, మహీమండలానికి ఏకఛత్రాధిపతివైన నీవు, ప్రాణం వదిలేస్తానంటావేమిటి? నువ్వు పోతే ఒక్క ఆవు ప్రాణమే నిలుస్తుంది. నువ్వు బతికి ఉంటే కోట్లకొలది జనుల ప్రాణాలను కన్నతండ్రిలాగా కాపాడగలవు. ఈ మాత్రం తోచింది కాదే నీకు?' అన్నది.

ఈ మాటలు విని ధేనువు జాలిగా చూడటం మొదలు పెట్టింది. అప్పుడు రాజు సింహంతో, 'నేను మహీమండలాని కంతకీ చక్రవర్తినని పొగిడావు. ఆపదలో ఉన్న ఈ ఆవునే రక్షించలేని నా చక్రవర్తిత్వమెందుకు? నువ్వీ దేవదారు వృక్షాన్ని ఎలా కాపాడుతున్నావో, ఆ ఆవుని నేనలాగ కాపాడుతున్నాను. దీనిని వదిలి వెళ్లటం న్యాయమా?' అన్నాడు.



పైగా...'ఒక ఆవు కోసమని నా మేను త్యజించకూడదన్నావు. కాని, ఇది అన్ని ఆవుల వంటిది కాదు సుమా. కామధేను పుత్రిక. కనుక నా శరీరం బలిగొని నా కీర్తి శరీరం నిలబెట్టు. నా శరీరానికేం? నీ ఆకలి తీర్చటం కన్నా నాకది ఎక్కువ కాదు. నా మాటవిను' అంటూ అనేక విధాల ప్రాధేయపడ్డాడు దిలీపుడు.

అట్లైతే సరే, అంటూ సింహం నందినీ ధేనువుమీదనుంచి కిందికి దుమికింది. వెంటనే రాజు చెయ్యి స్వాధీనమైంది. ఆడి తప్పని దిలీపుడు సింహం నోట పడటానికని వెళ్ళి దాని ముందు కూర్చుని భగవంతుని స్మరిస్తూ కన్నులు మూసుకున్నాడు.

సింహం తనమీద పడుతుందని కని పెట్టుకుని ఉన్న రాజుమీద తలవని తలంపుగా ఆకాశం నుండి పూలవాన కురిసింది.

భయంకరమైన సింహం ఆయనమీద పడలేదు సరికదా, 'కుమారా, లే' అన్న చల్లటి పలుకులు వినబడినై. రాజు కళ్ళు తెరిచేసరికి అక్కడ సింహం లేదు. 'ఏమైంది? నన్ను పిలిచినదెవరు?' అని రాజు విస్మయంతో అడిగేసరికి నందినీ ధేనువు ఇలా సమాధానమిచ్చింది.

'ఎవరా..! నేనే నిన్ను పరీక్షించటం కోసం ఈ చిత్రకథ అంతా కల్పించాను. సింహమూ లేదు. దేవదారువృక్షమూ లేదు. అంతా కల్పితమే. కుంభోదరుడు కాదు గదా, ఎవ్వరూ నన్నేమీ చెయ్య లేరు. నీ ధర్మబుద్ధికి మెచ్చుకున్నాను. నీకేమి వరం కావాలో కోరుకో రాజా!' అన్నది నందినీ ధేనువు.

రాజు వినయంగా 'తల్లీ, వంశం నిల బెట్టే కుమారుడు కావాలి' అని కోరాడు.

ఐతే, తన పొదుగులో పాలు ఒక దొప్పెడు తీసుకు తాగమంది ధేనువు. లేగ దూడ తాగిన తరవాత మిగతా పాలు వశిష్ఠ మహామునికి ఇచ్చి, వారి అను మతితో తీసుకుంటానన్నాడు రాజు.

ఈ మాటలకు మెచ్చుకుని, ధేనువు ఆశ్రమానికి తిరిగి వచ్చింది. జరిగిన సంగతులు విని సుదక్షిణాదేవి ఆనంద పడింది. రాజు ధేనువు పాలు తాగి భార్యా సమేతుడై, తన అయోధ్యానగరానికి తిరిగివచ్చాడు. ఆ దంపతులకు చక్కని పుత్రుడు కలిగాడు.

ఆ బాలుడే రఘువు. రఘువు పెద్ద వాడై గద్దె ఎక్కిన తరువాత గొప్ప రాజ నిపించుకున్నాడు. గొప్పరాజు కనుకనే ఆ వంశానికి అతని పేరుతో రఘువంశం అనేది ఏర్పడి ప్రసిద్ధికెక్కింది.





# పసిపాప నేర్పిన పాఠం

సీతారామయ్య ఓ చిన్నకారు రైతు. మూడె కరాల మాగాణిని సాగు చేసుకుని కుటుం బాన్ని పోషించుకునేవాడు. ప్రభుత్వం రైతులకు ఉచిత విద్యుత్ సరఫరాను రాత్రులు మాత్రమే ఇచ్చేది. ఓ రాత్రి సీతా రామయ్య పొలానికి నీరు తోడడానికని మోటరువేయబోతే విద్యుద్ఘాతం తగిలి అక్కడికక్కడే మరణించాడు.

తండ్రి హఠాన్మరణంతో కుటుంబపు బరువు బాధ్యతలు కొడుకు రాఘవ మీద పడ్డాయి. రాఘవ పై తరగతిలో చేరాలను కుంటూన్నంత లోనే ఆ దుర్ఘటన సంభ వించింది. తండ్రి అకాల మరణంతో క్రుంగి పోయిన తల్లి, పెళ్లీడుకు వచ్చిన అక్క, అనారోగ్యంతో బాధపడి వయసు మళ్లిన నానమ్మ అతని మీద ఆధారపడి ఉన్నారు. ఓ పక్క కుటుంబ బాధ్యత, మరోపక్క అప్పుల బాధానూ. చదువుకు అంతటితో స్వస్తి చెప్పి వ్యవసాయం చేపట్టక తప్ప లేదు రాఘవకు. ఓ ఎకరం నేల అమ్మేసి అప్పులు తీర్చేశాడు. మిగతా భూమిని సాగు చేయనారంభించాడు.

అయితే ఓ పక్క అలవాటు లేని పని, ఇంకో పక్క ప్రకృతి వైపరీత్యాలు, వ్యవ సాయం కలిసిరాలేదు అతనికి. ఒక ఏడు వర్షాభావం వల్ల పంట పండకపోతే.. మరో సంవత్సరం పండిన పంట కాస్తా వరదల పాలయ్యింది.

ఇంకో ఏడు నకిలీ విత్తనాల కారణంగా అసలు మొలకలే రాలేదు. కల్తీ కలిసిన ఎరువులు, పురుగుల మందు మరో సంవ త్సరం పంట నష్టానికి హేతువయ్యాయి. ఐదేళ్లుగా వ్యవసాయం చేస్తూన్న రాఘవకు ఎంత కష్టించి పనిచేసినా చేదు అనుభవాలే

తిరుమలశ్రీ



ఎదురయ్యాయి. రానురాను వ్యవసాయం చెయ్యడం కష్టమైపోయింది. మరో పక్క రుణదాతల వేధింపులు భరించలేని విధంగా తయారయ్యాయి.

నిస్సహాయతతో ఉక్కిరిబిక్కిరి ఐపోయాడు రాఘవ. ప్రభుత్వం నుండి కూడా తగు సహాయమేదీ అందకపోవడంతో నిరాశ పేరుకుపోయింది అతనిలో. చివరికి జీవితం పైన విరక్తి చెంది, ఇతర రైతుల లాగే తానూ ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

రాఘవ తన గ్రామానికి కాస్త దూరంలో ఉన్న సముద్రం వద్దకు బయలుదేరాడు. సముద్రానికి చేరువలో ఓ బెస్తవాడ ఉంది. ఆ వాడ మీదుగా వెళ్తున్న అతడికి ఒక దృశ్యం కనిపించింది.

ఓ మట్టి ఇంటి అరుగు ఎత్తుగా ఉంది. ఆ అరుగు పైన ఓ పసిపాప బోసి మొలతో కష్టం మీద లేచి నిలబడి తప్పటడుగులు వేస్తూ కింద పడిపోతోంది. మళ్ళీ పైకి లేచి నడవడానికి ప్రయత్నిస్తోంది.

ప్రయత్నించిన ప్రతిసారీ పడిపోతూ ఉన్నా మానడం లేదు. పడ్డప్పుడు దెబ్బ గట్టిగా తగిలితే ఏడుస్తోంది. అలాగని తన ప్రయత్నం విడవక మళ్లీ మళ్లీ ప్రయత్నిస్తూనే ఉంది.

రాఘువ ఆగిపోయి, ఆ అపురూప దృశ్యాన్ని చిత్రంగా తిలకిస్తూ ఉండిపోయాడు.

'పడిపోతుందనీ, దెబ్బ తగులుతుందనీ తెలిసీ తెలిసీ మళ్లీ మళ్లీ ఇష్టపడి ప్రయత్నిస్తోంది పిచ్చి పిల్ల. నడవడానికి ఆ చంటిదానికి అంత ఆత్రుత ఎందుకో?' అనుకున్నాడు విస్తుపోతూ. అతనికి తెలియకుండానే ఆ పలుకులు బైటకే వెలువడ్డాయి.

'పడిపోతుందని భయపడి ప్రయత్నమే చేయకపోతే ఆ పిల్ల నడక నేర్చుకునేదెలా బాబూ? మనిషికి ఓర్పు, పట్టుదల అలవడేది ఆ వయసు నుంచే కదా?' అన్న పలుకులు వినిపించడంతో ఉలికిపడి చూశాడు రాఘువ.

ఎప్పుడు వచ్చాడో, వల భుజాన వేసుకుని తన పక్కన నిలుచుని ఉన్న ఓ ముసలి జాలరి కనిపించాడు. అంతవరకు అతన్ని గమనించనే లేదు తాను.

‘ఔను బాబూ, పసివాళ్ళు దెబ్బలను కూడా ఖాతరు చేయకుండా, లేచి నిలుచో వాలనీ నడవాలనీ చేసే ప్రయత్నంలో గొప్ప బతుకు సూత్రం నిండి ఉంది..’ మళ్లీ అన్నాడతను నవ్వుతూ. ‘పట్టుదలతో ప్రయత్నించనిదే ఫలం దక్కదు. కష్టా లకు వెరిచి పిరికిదనంతో పారిపోతే జీవి తంలో ఏదీ సాధించలేం’.

అతని పలుకులో ఏదో సత్యం తొంగి చూస్తుంటే, సాలోచనగా జాలరి ముడ తలు పడ్డ వదనంలోకి చూశాడు రాఘవ.

‘అంతెందుకూ? సముద్రంలో ఎగిసి పడుతున్న ఆ కెరటాలనే తీసుకో... ఒడ్డుకు చేరుకోవాలని రేయింబవళ్లూ తెగ ఉవ్విళ్లూరుతుంటాయి. కాని, ఒడ్డుకు చేరుకోకుండానే మధ్యలోనే విరిగి తిరిగి నీటిలో ఒరిగిపోతాయి. అలాగని అవి తమ ప్రయత్నం మానుతున్నాయా? రెట్టింపు ఉత్సాహంతో ప్రయత్నిస్తూనే ఉన్నాయి.’ అన్నాడు ముసలి జాలరి.

‘మనిషి జీవితమూ అంతే బాబూ! కష్టాలకు వెరచి చతికిలబడిపోతే ఇక ముందుకు సాగేదెలా చెప్పు.. వేదాంతం చెబుతున్నా ననుకోకు, నగ్నసత్యమిది’ ముందుకు సాగిపోయాడు జాలరి.

‘నిజమే పసిపాపల నుండీ, సము ద్రపు కెరటాల నుండీ మనిషి నేర్చుకోవల సింది ఎంతో ఉంది’ అనిపించింది రాఘ వకు. హఠాత్తుగా జ్ఞానోదయమైంది అత నికి. ‘తీరని కష్టాల మూలంగా ఆత్మ విశ్వాసం కోల్పోయి నా దారి నేను చూసు కోవాలనుకున్నానే గాని.. నన్నే నమ్ము కున్న నా వారి గురించి ఆలోచించలేదు నేను. నాకంటే స్వార్థపరుడు మరొకడు ఉండడు’ అనుకున్నాడు రాఘవ తన తప్పు గ్రహిస్తూ.

ఆ పసిపాప నేర్పిన పాఠంతో కొత్తగా ఏర్పడ్డ ఆత్మవిశ్వాసంతో, ఆత్మహత్య చేసుకోవాలన్న ఆలోచనను విరమించు కుని వెనుదిరిగి ఇంటిముఖం పట్టాడు.





# కావేరి పుట్టుక

పూర్వకాలమందు శూరపద్మడు అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు మహాశక్తి మంతుడూ, క్రూరుడున్ను. వాడి ధాటికి తట్టుకోలేక, సమస్త లోకాలూ గడగడ లాడినై. దేవతలు సైతం వణికిపోసాగారు.

దేవతలే కాదు. ఆ రాక్షసరాజు కంట బడకుండా దేవేంద్రుడు కూడా తల దాచు కోవలసిన గతి ఏర్పడింది. అందుచేత దేవేంద్రుడు సరాసరి భూలోకానికి దిగి వచ్చి, ఎవళ్లూ తనను ఆనవాలు పట్టలే నట్టుగా ఒక అరణ్యంలో వెదురుపొద రూపంలో అవతరించాడు.

కొంతకాలానికి వేసంగి వచ్చింది. అడవిలోని చెట్లన్నీ ఎండిపోయినై. ఐతే, దైవాంశ కలది కనుక, వెదురుపొద మాత్రం పచ్చగానే నిలిచివుంది. అప్పుడు దేవేంద్రుడు ఆలోచించాడు: 'మండుకుపోయే ఈ వేసంగిలో తోటి చెట్లన్నీ ఎండిపోవడం, నేను మట్టుకు పచ్చగా ఉండటం విడ్డూరం కాదా! ఇందువల్ల నా ఉనికి సులువుగా బయటపడిపోతుందే. ఇప్పుడు నేను నా పలుకుబడి వల్ల గంగను భూలోకానికి తెప్పించగలిగితినా, నాగుట్టు బయటపడ కుండా ఉంటుంది. ఈ రూపంగా పర మేశ్వరుని ఆరాధించుకోవటానికి కూడా వీలవుతుంది.'

ఈ నిశ్చయంతో దేవేంద్రుడు వినాయ కుణ్ణి ప్రార్థించగా, గణపతి అతడి ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఇంద్రుడు తన కోరి కను వెల్లడించాడు. వినాయకుడు దేవేంద్రుని కోరిక తీర్చుదామనే ఉద్దేశంతో తరచి చూడగా, భూమిపై ఒక్క అగస్త్యుని కమండలంలో మాత్రం నీళ్ళు ఉన్నట్టు తెలుసుకొన్నాడు.

లక్ష్మి

వెంటనే గణపతి కాకిరూపం దాల్చి అగస్త్యుని ఆశ్రమానికి చేరుకున్నాడు. అక్కడ అగస్త్య మహర్షి మహాతపస్సులో మునిగి ఉన్నాడు. కాకి రూపంలో ఉన్న గణేశుడు చడీచప్పుడు చేయకుండా, ఏమీ ఎరుగనట్టు వెళ్ళి మహర్షి కమండంలోని నీళ్ళు కాసిన్నీ ఒంపేసి అక్కడి నుంచి పారిపోయాడు.

అప్పుడు అగస్త్యుని కమండలంలో జలం వరదలై భూలోకానికి పారింది. అది పోయి పోయి, దేవేంద్రుడున్న అడవినీ, అతని మారురూపంలో ఉంటున్న వెదురుపొదను కూడా తడిపివేసింది.

కొంతసేపైన తరవాత అగస్త్యుడు చూసుకుంటే కమండలంలో నీటి చుక్కయినా లేదు. అల్లంత దూరాన, కమండలాన్ని దొర్లించుకుపోయిన కాకి మాత్రం కనబడింది. రుషి దానిని వెంట తరిమాడు. కాని అది ఆయనకు దొరకలేదు సరికదా, పదునాలుగు భువనాలూ తిప్పింది.

అప్పుడు మహర్షి అది సామాన్యపు కాకి కాదని గ్రహించి, దివ్యదృష్టితో చూచాడు. నిజం తెలిసింది. అగస్త్యుడు గణపతి వైపు తిరిగి, 'ప్రణవ స్వరూపా! నీవెందుకు ఇలా పరుగులెత్తడం? లోకక్షేమం కోసం చేసిన ఈ మహాకార్యం నాకూ సమ్మతమే. ఐతే నా పూజాపురస్కారాలకు ఇప్పుడు కమండలంలో నీటి బొట్టయినా లేదే, ఎలా?' అనేసరికి, వినాయకుడు వెంటనే తన తొండంతో నీళ్ళు పట్టుకవచ్చి అగస్త్యుని కమండలంలో వదిలాడు.

తొలుత వినాయకుడు అగస్త్యుని కమండలంలోనించి దొర్లించగా వెల్లువలై భూమి మీద పారిన నీరే ఈనాటి కావేరి నదిగా వెలిసింది. ఆ తరువాత, ఆరుతలలతో సుబ్రహ్మణ్య స్వామి జన్మించి, లోకకంటకుడైన శూరపద్ముణ్ణి సంహరించాడు. ఈనాడు కూడా ఏటా సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవంలో, శూరపద్ముని సంహార కథ నడుస్తూనే ఉంటున్నది.





# దానశీలి కల

పూర్వం అవంతీ రాజ్యంలో, మహారాజు ఆంతరంగిక సలహాదారు పదవికి ఖాళీ ఏర్పడింది. అంతవరకు ఆ పదవిలో ఉన్న జయానందుడు వార్ధక్య భారానికి తోడు, అనారోగ్యానికి గురికావడంతో, ఆ స్థానానికి మరొకరిని ఎంపిక చేయవలసొచ్చింది. ఈ విషయం రాజు వీరవర్మ కొక పెద్ద సమస్యగా మారింది. కారణం, ఎంతో సూక్ష్మబుద్ధి గల జయానందుడు ఇంత వరకు ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహించాడు.

ఒకనాడు రాజు, ఈ విషయం గురించి తన మంత్రి సుబుద్ధితో ప్రస్తావించగా, ఆయన 'మహారాజా! ముందు దేశంలో రాజనీతి, ఆర్థిక, న్యాయ శాస్త్రాలను అభ్యసించిన వారందరినీ ఆహ్వానిద్దాం. వారికి శాస్త్ర విషయమై పరీక్ష నిర్వహించి, ప్రతిభ చూపినవారిని గుర్తిద్దాం. ఆ తర్వాత జయానందుడి సలహాపై వారిలో ఒకరిని తమ ఆంతరంగిక సలహాదారుగా నియమించ వచ్చు', అని సలహా ఇచ్చాడు.

రాజు ఇందుకు సమ్మతించగానే, మంత్రి వెంటనే దేశమంతటా చాటింపు వేయించాడు.

ఈ చాటింపు విని దేశం నలుమూలల నుంచి అనేక మంది యువకులు వచ్చారు. వారందరికీ శాస్త్రపరమైన పరీక్షలు నిర్వహించగా జయుడు, విజయుడు పోటీలో ప్రథములుగా నిలిచారు. వాళ్లిద్దరూ సమ ఉజ్జీలు కావడంతో మంత్రి సుబుద్ధి, జయానందుడిని కలుసుకుని సంగతి వివరించాడు.

అయ్యగారిశర్మ

జయానందుడు అంతా విని, 'ఆంత రంగిక సలహాదారన్నవాడు శాస్త్రాలలో పండితుడైనంత మాత్రాన సరిపోదు. క్లిష్ట మైన సమస్యలు ఎదురైనప్పుడు, వాటిని పరిష్కరించగల యుక్తి కూడా అతనికి కావాలి. శాస్త్రపరంగా ఉద్దండులైన, ఆ యువకులిద్దరిలో పదవికి ఎవరు అర్హులో, ఈ ఆఖరు పరీక్ష నిర్ణయిస్తుంది,' అని, ఏం చేయాలో మంత్రి సుబుద్ధికి వివరిం చాడు.

మర్నాడు మంత్రి జయుణ్ణీ, విజయుణ్ణీ పిలిపించి, కొద్దిసేపు వాళ్లతో, ఆమాటా, ఈ మాటా మాట్లాడిన తర్వాత ముఖం విచా రంగా పెట్టి, 'ఈ మధ్య నా మిత్రుడొకడు చాలా విషాదపరిణామానికి గురిఅయ్యాడు. అది మీరిద్దరూ వినగిన సంగతి!' అన్నాడు.

తర్వాత మంత్రి సుబుద్ధి, తన మిత్రుణ్ణి గురించి చెప్పిన వివరాలిలా ఉన్నాయి: మంత్రి మిత్రుడయిన దానశీలి వయో వృద్ధుడు; ఆయనకు కొంతకాలంగా గుండె జబ్బులాంటిది కూడా ఉన్నది. ఒకనాటి రాత్రి దానశీలికి ఒక భయంకర మైన కల వచ్చింది. ఆ కలలో ఆయన, ఒక కారడివిలో దారి తప్పిపోయాడు. ఆయన చెట్ల మధ్య పడుతూ లేస్తూ అతి కష్టం మీద ప్రయాణం సాగించి, చివరకు ఒక మైదాన ప్రాంతం చేరాడు. పైన నక్ష త్రాలు మిణుకుమిణుకు మంటున్నాయి. ఆ గుడ్డివెలుగులో ఆయనకు నాలుగు



దారులు కల ఒక కూడలి ప్రదేశం కని పించింది. ఆయన ఆ దారులలో ఒకదాని వెంట నడవసాగాడు. కొంతదూరం వెళ్ళే సరికి, దారే కనిపించనంతగా పొదలూ, చెట్ల గుబుళ్లతో నిండిన ప్రదేశం వచ్చింది. అక్కడ కొన్ని సింహాలు తిరుగుతున్నవి. వాటిలో ఒక సింహం దానశీలిని చూసి భయంకరంగా గర్జిస్తూ, ఆయనకేసి రాసా గింది.

దానశీలి, ప్రాణభయంతో వెనుదిరిగి పరిగెత్తి, కొంతసేపటికి కాలిదారుల కూడ లికి చేరాడు. సింహం జాడలేదు. ఆయన అలసట తీర్చుకున్నాక, రెండో దారి వెంట నడవసాగాడు. కొంతదూరం వెళ్లాక ఆయ నకు పెద్ద వెలుగు కనిపించింది. దానశీలి

ఒక పొదచాటుకు చేరి, ఆ వెలుగు వస్తున్న వైపుకు చూశాడు. ఆ ప్రదేశంలో అనేక మైన పెద్ద పెద్ద పుట్టలున్నవి. వాటిపై కాల సర్పాలు పడగలు విప్పిఆడుతున్నవి. ఆ పడగలపై ఉన్న మణులు, కాంతులు విరజిమ్ముతూ ప్రకాశిస్తున్నవి.

ఆశ్చర్యంతో, ఆ దృశ్యాన్ని చూస్తున్న దానశీలిని, పుట్టల మధ్య ఆడుతున్న ఐదు తలల మహాసర్పం ఒకటి చూసి, బుసలు కొడుతూ అమితవేగంతో ఆయనకేసి రాసాగింది. ఆయన గిరుక్కున వెనుది రిగి, శక్తికొలదీ పరిగెత్తి, తిరిగి నాలుగు దారుల కూడలిని చేరాడు. మహాసర్పం జాడలేదు.

ఈసారి దానశీలి మూడవ దారిగుండా నడవసాగాడు. కొంతదూరం వెళ్లాక ఆ దారి ఒక కొండ దగ్గిర ఆగిపోయింది. ఆ ప్రదేశాన ఆయనకు కొన్ని మానవ కంకాళాలు కనిపించాయి. కీడును శంకించిన దానశీలి, వెనుదిరిగేలోపలే, దాపుల ఉన్న గుహలోంచి భయంకరాకారుడైన రాక్షసు డొకడు ముక్కుపుటాలు ఎగరవేస్తూ బయటికి వచ్చాడు. వాణ్ణి చూస్తూనే దానశీలి కెవ్వుమంటూ అరిచి పరిగెత్తి నాలుగు దారుల కూడలిని చేరాడు.

అయితే, రాక్షసుడు పెద్దగా పలక రిస్తూ, తనకేసి రావడం చూసిన దానశీలి, వెంటనే అక్కడున్న నాలుగవ దారి వెంట పరిగెత్తాడు. ఆ దారి అతణ్ణి కొండ అంచుకు చేర్చింది. దానికి దిగువన పెద్ద అగాధ మున్నది. వెనుక రాక్షసుడు, ముందు అగాధం. ప్రాణాలమీద ఆశ కోల్పోయిన



దానశీలి నిలువెల్లా గజగజా వణికిపోతూ అగాధంలోకి తొంగి చూసేంతలో, కాళ్ల కింద ఉన్న రాయి జారింది. ఆయన కెవ్వుమని అరుస్తూ అగాధంలోకి పడిపోయాడు.

మంత్రి అలా చెప్పి, ఒక క్షణం ఆగి జయ విజయులతో, 'చూశారా, ఎంత భయంకరమైన కలో! అసలే గుండె జబ్బుతో బాధపడుతున్న, నా మిత్రుడు దానశీలి, కలనుంచి మెలకువ వస్తూనే గుండెపోటుకు గురి అయి మరణించాడు,' అన్నాడు.

అప్పుడు జయుడు ఎంతో విచారంగా, 'స్వప్నంలో కలిగే అనుభూతులకు శరీరం కూడా లోనవుతుందని, మనస్తత్వ శాస్త్రం చెబుతున్నది. తమ మిత్రుడు కలలో నాలుగుసార్లు ప్రాణభయానికి లోనయ్యాడు. అసలే గుండెజబ్బు మనిషి కనక, ఆ వత్తిడికి తట్టుకోలేక గుండె ఆగిపోయి ఉంటుంది. మీ మిత్రుడి మరణానికి, నా ప్రగాఢ సానుభూతిని తెలుపుతున్నాను,' అన్నాడు.

మంత్రి తల పంకించి, విజయుడికేసి చూశాడు.

విజయుడు చిరునవ్వు నవ్వుతూ, 'క్షమించాలి, మహామంత్రీ, మీరు చెప్పినదంతా ఒక కట్టుకథ,' అన్నాడు.

మంత్రి కోపంగా, 'అదెలా కట్టుకథో నిరూపించగలవా?' అని అడిగాడు.

దానికి విజయుడు వినయంగా, 'మీ మిత్రుడు మెలకువ వస్తూనే, గుండెపోటుకు గురై వెంటనే చనిపోయినప్పుడు ఆయనకు కల వచ్చిన విషయం మీకు తెలిసే అవకాశం లేదు కదా,' అన్నాడు.

మంత్రి సుబుద్ధి, విజయుణ్ణి అభినందించి, అప్పటికప్పుడే అతణ్ణి రాజు వీరవర్మకు ఆంతరంగిక సలహాదారుగా నియమించాడు.





# మతిమరుపు మనిషి

రామగోవింద మతిమరుపు గురించి ఆ ఊరిలో అందరికీ తెలుసు. అతడికి మతి మరుపు బాగా ఎక్కువ. భర్త మతిమరుపు గురించి భార్య సీతమ్మకు పెళ్లయిన తర్వాత గానీ తెలిసి రాలేదు.

సీతమ్మ పెళ్లయి కాపురానికి వచ్చిన కొత్తలో పంట నూర్పిడి చేసి ధాన్యాన్ని బండిమీద వేసుకుని అమ్మకానికి పట్నం వెళ్లాడు రామగోవింద. ధాన్యాన్ని అమ్మి డబ్బు తీసుకోవటం మరిచిపోయి ఇంటికి వచ్చాడు. సీతమ్మ నెత్తీనోరూ కొట్టుకుంది.

ఒకసారి కార్తీకమాసంలో రామగోవింద దగ్గర్లోనే ఉన్న నది వద్దకు స్నానానికి వెళ్లాడు. స్నానం చేసిన తరువాత పంచెకు బదులుగా ఎవరిదో చీరను పంచెలాగా కట్టుకుని ఇంటికి వచ్చాడు. ఊరిలోని వారంతా రామగోవిందను చూసి పకపక నవ్వారు. సీతమ్మకు దాంతో తల కొట్టేసి నంత పనయింది.

రామగోవిందకు బాలాజీ అనే తమ్ముడు ఉన్నాడు. అతడికి పెళ్లి కుదిరింది. ఆ సమయంలోనే రామగోవిందుకు జబ్బు చేసింది. తన జబ్బు త్వరగా నయమైంది. మొక్కు తీర్చుకోవడానికి తనకు తోడుగా తమ్ముడు బాలాజీని వెంటబెట్టుకుని తిరుపతికి వెళ్లాడు. తీరా తిరుపతికి వెళ్ళాక తన మొక్కు విషయం మరిచిపోయి, దగ్గ రుండి తమ్ముడికి గుండు చేయించి ఇంటికి తీసుకువచ్చాడు. రామగోవింద చేసిన పనికి అంతా చివాట్లు పెట్టారు.

సీతమ్మ భర్త మతిమరుపుతనాన్ని పోగొ ట్టాలని, వైద్యులను సంప్రదించింది. రక రకాల మందులను అతడి చేత తినిపిం చింది. అయినా ఫలితం కనపడలేదు.

ప్రతాప రవిశంకర్

అతనికి మధ్యాహ్న భోజనం తను ఏమి తిన్నాడో సాయంత్రానికి గుర్తుండేది కాదు. బాగా తెలిసిన వారు అతడి భోజనం గురించి అడిగి ఆటపట్టించేవారు. ఒక సారి భార్య సీతమ్మ పుట్టింటికి వెళ్ళి అయిదు రోజుల వరకు తిరిగి రాలేదు. రామగోవింద తను భోజనం చేసిన మాట మరిచిపోయి ఒక రోజులో ఆరుసార్లు భోజనం చేశాడు. సీతమ్మ తిరిగి ఇంటికి వచ్చేసరికి ఇంట్లో ఉన్న బియ్యం, పప్పు దినుసులన్నీ అయిపోయాయి. ఆ రోజు నుంచి సీతమ్మ ఎక్కడకు వెళ్ళినా భర్తను వెంటబెట్టుకుని వెళ్ళడం మొదలెట్టింది.

సీతమ్మ అన్న మల్లేశం ఒకసారి వారిని చూడడానికి వచ్చాడు. మూడురోజులు ఉండి వెళ్లబోయేముందు తనకు నదీ స్నానం చెయ్యాలని ఉందని చెప్పాడు. రామగోవింద బావమరిదిని తీసుకుని నదికి వెళ్లాడు. నది ఒడ్డున కొంతమంది పిల్లలు పశువులను మేపుతూ ఆడుకుం టున్నారు. బట్టలను ఒడ్డున ఉంచి వాటిని చూడమని రామగోవిందకు చెప్పి మల్లేశం నదిలోకి దిగాడు. రామగోవింద దృష్టంతా పిల్లలు ఆడుతున్న ఆటమీదే ఉంది. మల్లేశం నదిలో ఈత కొడుతున్నాడు.

కొంత సమయం గడిచాక రామగోవింద బావ మరిది విషయం మరిచిపోయి, ఒక్కడే ఇంటికి తిరిగివెళ్లాడు. సీతమ్మ మల్లేశం గురించి అడిగిన తర్వాత మరలా నది దగ్గరకు పరుగుదీశాడు.



రామగోవింద నది దగ్గరకు వెళ్లేసరికి ఒడ్డున మల్లేశం బట్టలు లేవు. పశువులను కాస్తున్న పిల్లలు లేరు. ఎవరో బట్టలను ఎత్తుకుపోయారు.

దిశమొలతో బయటకు రాలేక మల్లేశం నదిలోనే ఉండిపోయాడు. మరలా ఇంటికి తిరిగి వచ్చి రామగోవిందం బట్టలను తీసుకుని వెళ్లే వరకూ మల్లేశం నీళ్లలోనే ఉన్నాడు.

భర్త చేసిన పనికి సీతమ్మ నొచ్చుకుని అన్నకు క్షమాపణ చెప్పుకుంది. ఇంత జరుగుతున్నా రామగోవింద తన మతి మరుపు గురించి అంతగా పట్టించుకునే వాడు కాడు.

ఒక రోజు రామగోవింద పక్క ఇంట్లో ఉంటున్న వాళ్లు పక్క ఊరిలో జరుగు

తున్న తిరునాళ్ల గురించి మాట్లాడుకోవడం అతను విన్నాడు. అతనికి కూడా తిరునాళ్లకు వెళ్లాలనే కోరిక కలిగింది. తను తిరునాళ్లకు వెళుతున్నట్టు భార్యకు చెబుతున్నప్పుడు అతడి అయిదేళ్ళ కొడుకు తనని కూడా తిరునాళ్లకు తీసుకువెళ్లమని మారాం చేశాడు.

ఇక చేసేదేమీ లేక రామగోవింద కొడుకుతో కలిసి తిరునాళ్లకు బయల్దేరాడు. పిల్లాడిని మరిచిపోకుండా ఉండటానికి వాడి చేతికి ఒకతాడు కట్టి భర్త చేతికి ఇచ్చింది సీతమ్మ. కొడుకును భుజం మీద కూర్చోబెట్టుకుని ఇల్లు వదిలాడు రామగోవింద.

అయితే తిరునాళ్లు జరిగే పక్క ఊరిలో కోతులు చాలా ఎక్కువగా ఉంటాయని, తినుబండారాలు కొని తీసుకు రావద్దని భర్త బయలుదేరేముందు ఒకటికి రెండు సార్లు గట్టిగా చెప్పింది సీతమ్మ. అతడు సరేనన్నాడు.

సాయంత్రం వరకు తిరునాళ్లు చూసి చీకటిపడుతున్న వేళకు ఇల్లు చేరాడు రామగోవింద. తలుపు తీసి ఎదురుగా నిలుచున్న భర్తను చూసి పెద్దగా అరిచింది సీతమ్మ.

'అలా అరవకు. నేను నీ భర్తను. కాకపోతే తిరునాళ్లలో తిరిగి దుమ్ముకొట్టుకున్నానంతే' అని నవ్వాడు రామగోవింద.

'పిల్లవాడు ఎక్కడ?' అనడిగింది సీతమ్మ నోరు పెగుల్చుకుని. 'ఆ జనసముద్రంలో మన పిల్లాడిని జాగ్రత్తగా ఇల్లు చేర్చేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది' అని చేతిలో ఉన్న తాడును వదిలి భుజంమీద అప్పటివరకు మోస్తున్న బరువును కిందకు దించాడు.

అలా దించగానే ఒక్క గెంతులో బయటకు పరుగు దీసింది పెద్ద కోతి. పిల్లాడిని తిరునాళ్లలో వదిలిపెట్టి పెద్దకోతిని మోసుకుని వచ్చినందుకు సీతమ్మ విరుచుకుని పడిపోయింది.






# పచ్చ గణపతి

ఊళ్లో పర్యావరణాన్ని కాపాడేందుకు బడిపిల్లల్లో అవగాహన కలిగించడం కోసం మూడేళ్ల క్రితం ప్రతి పాఠశాలలోనూ ఒక్కో బాలదళాన్ని తయారు చేశారు పర్యావరణ పరిరక్షణ సమితివారు. ఒక్కో స్కూల్లోని దళంలో దాదాపు పదిహేను మంది దాకా బాల సభ్యులున్నారు. ఈ బాలదళాలకి ప్రతి ఏటా పోటీలు కూడా నిర్వహిస్తున్నారు.

పదేళ్ల ప్రతాప్‌కి ఈ కార్యక్రమం ఎంతో నచ్చింది. ప్రతాప్ చదువుతున్న ఠాగూరు పాఠశాల దళంవారు రెండేళ్లుగా ఎంత కృషి చేస్తున్నా ఎందుకోగాని బహుమతి విషయంలో వెనుకబడిపోతూనే ఉన్నారు. అందుకే ప్రతాప్‌కి ఈ ఏడాది ఎలాగయినా బహుమతి సంపాదించుకోవాలని పట్టుదల కలిగింది. తన ఆలోచనను ప్రాణ స్నేహితుడయిన సోమేష్‌తో చెప్పాడు.

'ఈసారి మా స్కూలు బాలదళం ఎంత కష్టమయినా సరే బహుమతి సంపాదించాలనుకుంటున్నాంరా'

'మా కాకతీయ స్కూలు బాలదళాన్ని తక్కువ అంచనా వెయ్యకురా ప్రతాప్' అన్నాడు సోమేష్ స్నేహితుడి భుజం తట్టి హెచ్చరిస్తూ. ఎందుకంటే క్రితం ఏడాది మొదటి బహుమతి గెలుచుకున్న బాల దళం అది.

ప్రతాప్ నిరాశపడలేదు. నీకో విషయం తెలుసా? ఇవాళ మా తెలుగు మాష్టారు ఓ మంచి పద్యం నేర్పించారురా. దాని భావం నా కెంతో నచ్చింది' అన్నాడు మిత్రుడితో.

'నువ్వు బావుందన్నావంటే విశేషమే. అదేంటో నాకూ చెప్పు' అన్నాడు సోమేష్ ఆత్రుతగా.

పి.వి. శేషారత్నం




'అదేరా.. ఆరంభింపరు నీచమానవులు.. అనే శతకపద్యం ఇది. దాని అర్థం ఏంటంటే... ఏదన్నా ఒక కార్యాన్ని అది సఫలమవుతుందో లేదో అనే భయంతో మామూలు మనుషులు అసలు మొదలు పెట్టరట. కాస్త మధ్యములు ఆ కార్యాన్ని ప్రారంభించి ఆటంకాలు రాగానే మధ్యలో వదిలేస్తారుట. కేవలం ఉత్తములైనవారు మాత్రమే ప్రారంభించిన పనిని ఎన్ని ఆటంకాలొచ్చినా విడిచిపెట్టకుండా పూర్తి చేస్తారట. అందుకని నేను ఉత్తముడిగా ఉండదల్చుకున్నాను'.

ప్రతాప్ మాటల్లోని దృఢ నిశ్చయానికి సోమేష్ ఎంతో అభినందించాడు.

పర్యావరణ దినోత్సవానికి హాజరయిన అన్ని పాఠశాలల విద్యార్థులతో ఆ ఆవరణ కళకళల్లాడిపోతోంది. ముఖ్య అతిథిగా వచ్చిన పురపాలక శాఖ కమిషనర్ మాట్లాడుతూ, 'ఈ రోజు చాలా శుభదినం. పచ్చదనానికి, పర్యావరణ పరిరక్షణకు ప్రత్యేక కృషి చేసిన బాలదళాల విద్యార్థులను అభినందించేందుకే ఈ సభ. ముందుగా ఠాగూర్ పాఠశాల బాలదళం నాయకుడు ప్రతాప్‌ను ప్రథమ బహుమతి అందుకునేందుకు వేదికమీదకు రావలిసిందిగా కోరుతున్నాను' అనగానే చప్పట్లు మారుమోగాయి.

'ఈ ఏడాది ఇదిగో.. ఈ విశిష్ట పచ్చగణపతిని తయారు చేసి అందరి ప్రశంసలూ అందుకున్న ప్రతాప్ దళాన్ని నేను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఇదిగో చూడండి. ఈ గణపతిని కేవలం మట్టితో ప్రత్యేకంగా తయారు చేయడమే కాదు.. వేపాకు రసం వంటి ప్రకృతి సిద్ధమైన రంగులే వాడటం విశేషం. అంతేకాదు. సామాన్య ప్రజానీకానికి పాలవెల్లి, చత్రంల ఖర్చు పొదుపు అయ్యేందుకు.. పైన వెదురు బద్దలతో చేసిన ఈ పాలవెల్లిలో ఛత్రాన్ని కూడా అమర్చడమే కాదు.. పాలవెల్లిని మామిడాకుల తోరణంతో ఎలా అందంగా తీర్చి దిద్దారో చూడండి. గణపతి పీఠం వద్ద ఇలా మనం వ్యర్థంగా భావించే పశువుల పేడతో అలికిన ఆవరణ... అందులో సున్నంతో తక్కువ ధరలో ఈ విగ్రహాలను చూసి నేనెంతో ముచ్చటపడ్డాను. కారణం.. వీటి నిమజ్జనం వల్ల చెరువులకు గాని, నదులకు గాని, కుంటలకు గాని ఎలాంటి కాలుష్యమూ అంటదు

సరికదా దీని తయారీకి వాడిన వేపాకు రసం వల్ల నీటిలోని క్రిములూ నశిస్తాయి. ఆరోజు అక్కడ ఉంచిన రెండువందల విగ్రహాలూ అరగంటలో అమ్ముడుపోయాయి. ఈ కుర్రాడిని పిలిచి ఇంత చవకగా అందమైన గణపతిని తయారు చెయ్యాలని ఎందుకనిపించింది?' అని అడిగాను. 'ఆ తర్వాత విషయం ప్రతాప్ చెప్తాడు' అన్నారు కమిషనర్ నవ్వుతూ.

ప్రతాప్ సభకు నమస్కరించి చెప్పాడు. ''ప్రతి ఏటా వినాయక నిమజ్జనం తర్వాత నేను మా దగ్గిర్లోని చెరువు వద్దకు వెళ్లి చూస్తే.. అక్కడంతా చెత్తతో దుర్వాసన.. పైగా కృత్రిమ రంగుల్లోని రసాయనాలకి ఎన్నో చేపలు జలచరాలు చచ్చిపోవడం చూసి ఈ విషయాన్ని కమిషనర్ గారి వద్దకు తీసుకుపోయాను. అందుకు 'ప్రతాప్.. ఇంకా వినాయకచవితి రెండు రోజులే ఉంది. ఇలాంటి విగ్రహాలు ఓ ఐదు వందలు తయారు చేయించగలవా? నీకు ముందస్తుగా కొంత నగదు ఇప్పిస్తాను' అన్నారు. తర్వాత నేను మా పాఠశాల బాలదళం సాయం తీసుకుని సకాలంలో విగ్రహాలు తయారుచేసి అందించాను. తర్వాత చెరువులోని కాలుష్య నివారణకోసం, మా బాలదళం వినాయక చవితి మరునాడు చెరువులోని వాడిపోయిన పువ్వులు, ఆకులు కాయలను బస్తాలతో తీసుకుపోయి మా బడిలోని తోటకు సహజ ఎరువు తయారు చేయడం కోసం ఒక పెద్ద గొయ్యి తవ్వి అందులో ఈ చెత్తంతా వేసి మట్టితో కప్పేసాం. అన్నింటికంటే ముఖ్యం... ఈ ఏడాది మేము తయారు చేసిన పచ్చగణపతినే ఎంతో ఇష్టంగా మా ఇళ్లలో వాళ్లు గొప్పగా పూజించడం మాకెంతో తృప్తిగా అనిపించింది. గణపతి తయారీలో మాకెన్నో సూచనలిచ్చిన మా క్రాఫ్ట్ మాస్టారు గారికి నా కృతజ్ఞతలు.'

ఆనాటి ఉత్సవంలో కమిషనర్ గారి చేతిమీదుగా ప్రతాప్ పెద్ద వెండికప్పు అందుకుంటూంటే సభలో మళ్లీ పెద్ద పెట్టున హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి.



# మెలకువ

రామభద్రపురంలో బంగార్రాజు అనే ఒక వర్తకుడు ఉండేవాడు. అతడు వృద్ధుడయ్యాక ఇద్దరు కుమారులను పిలిచి, 'మనకు అచ్చివచ్చిన కిరాణా వ్యాపారం ఇద్దరూ వేరు వేరుగా చేసుకొని వృద్ధిలోకి రండి! నాకు వ్యాపారం చేసే ఓపిక తగ్గింది!' అని చెప్పి, 'ధర్మం తప్పవద్దు. మెలకువతో వ్యాపారం అభివృద్ధి చేసుకోండి!' అని హితబోధ చేశాడు.

పెద్దకుమారుడు చిన్ని కుమారుడు వ్యాపారాలు ఆరంభించారు. కొంత కాలం గడిచాక తండ్రి ఇద్దరు కుమారుల వ్యాపారాల గురించి వాకబు చేశాడు. పెద్దవాడి వ్యాపారం ఎదుగూ బొదుగూ లేక సాగుతుంటే చిన్నవాడి వ్యాపారం మూడుపువ్వులారు కాయలుగా వర్ధిల్లుతోంది.

ఒకరోజు బంగార్రాజు ఇద్దరు కుమారులను పిలిచి వ్యాపారం గురించి అడిగాడు. పెద్దవాడు చాలా నైరాశ్యంగా, 'మీరు చెప్పిన రీతిలోనే ధర్మం తప్పక వ్యాపారం చేస్తున్నాను. అయినా నా వద్ద కొనడానికి వచ్చేవారు బహు తక్కువ గానే ఉంటున్నారు!' అని నిట్టూర్పు విడిచాడు. చిన్నవాడు హుషారుగా 'నాన్నగారూ! కొనడానికి వచ్చిన వారి మనస్తత్వం అర్థం చేసుకొని వ్యాపారం చేస్తున్నాను. ఎప్పుడో కాని అవసరం కాని వస్తువులను మిగతా వర్తకులకంటే చౌకగా ఇస్తున్నాను. మిగిలిన వస్తువులు కూడ అలాగే ఇస్తానని నా దుకాణానికి జనం ఎగబాకుతున్నారు. మీరు చెప్పినట్టుగానే నేను ధర్మం తప్పలేదు. ఒక వస్తువు అమ్మకంలో కలిగిన నష్టం మిగిలిన వస్తువుల మీద పూరించుకుంటున్నాను! అదే నా వ్యాపార విజయానికి రహస్యం!' అన్నాడు.

చిన్నవాడి తెలివితేటలకు బంగార్రాజు అబ్బురపడి చిన్నవాడిని చిల్లర వ్యాపారంలో స్థిరపరిచి పెద్దవాడిని టోకు వ్యాపారంలో స్థిరపరిచాడు.

– బెలగాం భీమేశ్వరరావు





# శిథిలాలయం - 18

*(నాగుమల్లిని ఎత్తుకుపోయిన శిథిలాలయ పూజారి, ఆమెను విడిచి పుచ్చేందుకు, శివాలుణ్ణి తాళపత్రగ్రంథం మూల్యంగా చెల్లించమన్నాడు. శివాలుడు అందుకు అంగీకరించాడు. దొంగలు ఉన్న చోటు చూసి శిఖిముఖి తిరిగి వస్తూండగా, అలికిడి విన్న సవర భేరుండం, ఈటెను ఝళిపిస్తూ అతడి పైకి రాసాగాడు. తరవాత--)*

శిఖిముఖి క్షణాల మీద తను ఏం చెయ్యటం క్షేమమో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. సవర భేరుండాన్ని వెనక నుంచి వెళ్లి తలమీద బలంగా ఒక దెబ్బకొట్టి చడీ చప్పుడూ లేకుండా చంపెయ్యవచ్చు. కాని, అందువల్ల పూజారి ముఠా తమ రహస్య నివాసం శత్రువులకు తెలిసి పోయిందని, నాగుమల్లిని మరొక చోటుకు ఎత్తుకు పోయి దాయవచ్చు..

ఇలా ఆలోచించిన శిఖిముఖి, సవర భేరుండం కంట పడకుండా పారిపోయేం దుకు ఒక ఎత్తు వేశాడు. అతను దాగివున్న పొదల్లో నుంచి దాపుల నున్న మరికొన్ని పొదల కేసి నాలుక్కాళ్లమీద నడుస్తున్న జంతువులా కుప్పించి దూకుతూ, చిరుత గండు కోపంతో అరిచినట్టు పెద్దగా గర్జన చేశాడు. ఆ ధ్వని వింటూనే సవరభేరుండం బెదురుకుని ఠక్కున ఆగిపోయి, వెనక్కు ఒక్కొక్క అడుగే వేస్తూ, 'చిరుతగండా! ఏదో మనిషనుకున్నాను' అన్నాడు భయం వల్ల వణుకుతున్న గొంతుతో.

భేరుండాన్ని ఇంత తేలిగ్గా మోసగించ గలిగినందుకు సంతోషపడిపోతూ, శిఖి ముఖి మరింత బిగ్గరగా అరుస్తూ, పొదల

దాసరి సుబ్రహ్మణ్యం



చాటునుంచి మహా వృక్షాలున్న అరణ్యం లోకి పరుగెత్తాడు. బయట అడవి జంతువు అరవటం వింటూనే, ఇంట్లోకి పోయిన శిథి లాలయ పూజారి, దొంగల్లో ఇద్దర్ని సవర భేరుండానికి సాయం వెళ్లమని చెప్పాడు.

ఆ దొంగలిద్దరూ కత్తులూపుకుంటూ, 'ఎక్కడ చిరుతపులి? ఎక్కడ?' అంటూ సవర భేరుండం ఉన్న పొదల దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు.

సవర భేరుండం, అప్పటికి తేరుకుని, పెద్దగా నవ్వుతూ, 'ఇంకెక్కడి చిరత? అది నా మీదికి దూకబోయే సమయంలో ఈటెతో గట్టిగా ఒకే పోటు పొడిచాను. ఆ దెబ్బకు వెల్లకిలా పొదల్లో పడి లేచి అరణ్యం కేసి దౌడు తీసింది' అన్నాడు.

'భేష్, సాహసంలో, తెగువతనంలో మాతో సరితూగ్గలవాడివి. ఇక రా. పూజారి దొర నీకేదో ప్రమాదమైన పని ఒప్పచెప్ప బోతున్నాడు' అన్నాడు దొంగల్లో ఒకడు.

'ప్రమాదమైన పనా? ఊహూ, నాకేం భయం లేదు. దొర ఆజ్ఞాపిస్తే, అలా ఆకాశంలోకి ఎగిరిపోగలను. నేను మానవ గండభేరుండాన్ని, తెలుసుగా!' అన్నాడు సవరభేరుండం.

'ఆ సంగతి మాకు తెలుసు. తెలియని వాళ్లు నువ్వేదో హెచ్చులు మాట్లాడుతున్నా వనుకుంటారు. పూజారి దొర మంత్ర శక్తికి తిరుగేమిటి?' అన్నాడు దొంగల్లో రెండో వాడు.

'ఏమిటా చచ్చు కబుర్లు? భేరుండాన్ని చిరుతపులి పీక కొరికి ఎత్తుకుపోలేదు, నయం! వాడు బాగా మైకంలో ఉన్నట్టు న్నాడు. వాగుడు కట్టి పెట్టి రమ్మనండి' అంటూ శిథిలాలయ పూజారి కేక పెట్టాడు.

సవర భేరుండాన్ని ఇంత తేలిగ్గా మోసం చేసి అరణ్యంలోకి పారిపోయిన శిఖిముఖి అతి వేగంగా లోయలోకి పరిగెత్తాడు. అక్కడ అతడు దివిటీల వల్ల లోయ అంచున ఉన్న ఇంటిని గుర్తించి, అక్కడికి చేరేసరికి, శివాలుడూ, సవర గండుపోతూ అందరూ కనిపించారు.

శిఖిముఖి వాళ్లకు, నాగుమల్లి బంధించబడి ఉన్న ఇంటిని గురించి చెప్పి, దాన్ని చుట్టుముట్టితే, ఆమెను రక్షించటమే గాక,

శిథిలాలయ పూజారిని కూడా పట్టుకుని బంధించవచ్చని తెలియపరిచాడు.

శివాలుడు తన కొడుకు చెప్పినట్టు చేయటమే సరి అయిన మార్గం అని సవర గండుపోతుతో సంప్రతించి నిర్ణయించాడు. తండ్రి ద్వారా శిఖిముఖి, పూజారి తాళ పత్రాలున్న సంచీని వేలాడకట్టమన్న రావి చెట్టు సంగతి విన్నాడు. అతడు ముందు జాగ్రత్తగా, ఆ రావిచెట్టు ప్రాంతాల కాపలా కోసం ఇద్దరు శబర యువకుల్ని పంపాడు.

ఆ తర్వాత ధైర్యసాహసాలు గల పది మంది శబర యువకుల్నీ, విక్రమకేసరినీ వెంటబెట్టుకుని శిఖిముఖి, శిథిలాలయ పూజారి ఇంటి కేసి వేగంగా ప్రయాణమయాడు. అరగంట తరవాత ఆ ఇంటి ప్రాంతాన్ని చేరేసరికి శిఖిముఖికి, ఈ సారి ఇంటి ముందున్న పొదల ప్రాంతాల దొంగల్లో ఒకడు అటూ ఇటూ గస్తీ తిరుగుతూ ఉండటం కనిపించింది. కిటికీలోంచి దీప కాంతి బయటకు పడుతున్నది.

ఆ గస్తీవాణ్ణి చూస్తూనే శిఖిముఖికి పూజారి ఏదైనా ప్రమాదాన్ని శంకించాడా అన్న అనుమానం కలిగింది. వాడు బహు టక్కరి. నాగుమల్లిని మరో చోటుకు ఎత్తుకుపోలేదు గదా అన్న భయం కలగింద తడికి. ఏది ఏమైనా ముందు ఇంటిని చుట్టు ముట్టాలి. శిఖిముఖి, విక్రమకేసరితో తాను చేయబోయే పని గురించి చెప్పాడు. గస్తీ వాడు ముందుగా హెచ్చరిస్తే, ఇంట్లో



ఉన్న శత్రుమూక అంతా పారిపోయే ప్రమాదం ఉన్నది. కనక గస్తీవాణ్ణి కిక్కురు మనకుండా తుదముట్టించాలి.

శిఖిముఖి అనుచరుల్ని అంత దూరాన వదిలి పొదల వెనగ్గా పాకుతూ పోయి, గస్తీవాడు తానున్న పొద పక్కగా నడిచే సమయంలో వెనక నుంచి కత్తిపిడితో బలంగా నెత్తిమీద కొట్టి, వాడు కింద పడ బోయే సమయంలో అరవకుండా ఉండేం దుగ్గాను గొంతు పట్టుకోబోయాడు. కాని, దొంగ దెబ్బ తిని ముందుకు తూలి పడబోతూనే పెద్దగా చావుకేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ఇంట్లో ఉన్న శిథిలాలయ పూజారి ప్రమాదమేదో ముంచుకు వస్తున్నదని గ్రహించి, సవరభేరుండంతో

‘ఒరే, భేరుండం! మనం తక్షణం ఈ ఇల్లు వదిలి పోవాలి. నా వెంట పరిగెత్తుకురా!’ అంటూ ఇంటికి వెనకవైపు ఉన్న వాకిలి తెరుచుకుని, దాపుల ఉన్న అరణ్యం కేసి పరిగెత్తాడు.

శిఖిముఖి గస్తీ దొంగకేక పెట్టగానే తాను వేసిన పథకం చెడిందని గ్రహించి, తన అనుచరుల్ని ఇంటిని చుట్టుముట్టమని హెచ్చరించాడు. విక్రమకేసరీ, శబర యువకులూ ఇల్లు చుట్టుముట్టారు. శిఖిముఖి ఇంటి ముందు ద్వారం నుంచీ, విక్రమకేసరి వెనక వైపు ఉన్న ద్వారం నుంచీ కత్తులు ఝుళిపిస్తూ లోపలి కడుగు పెడుతూనే, ‘అందరూ లొంగిపోండి, ఎదురు తిరిగారో ప్రాణాలు దక్కవు జాగ్రత్త!’ అన్నారు.

కొయ్యబల్ల మీద కూర్చుని ఉన్న నాగుమల్లి వాళ్ళిద్దరి కేసి చూస్తూ, ‘భలే తెలివైన వాళ్ళు. మీరు పట్టుకోదలిచిన పూజారి వెధవ భేరుండంతో ఇంతకు ముందే పారిపోయాడు. అదుగో, ఆ మూల వున్న ముగ్గురు సోమరి వెధవలూ మాంచి కైపుతో కళ్ళు మూశారు. భూకంపం వచ్చి ఇల్లు కూలినా లేవరు,’ అన్నది.

శిఖిముఖి, నాగుమల్లిని సమీపించి మౌనంగా, ఆమె కాలిచేతి కట్లను విప్ప సాగాడు. విక్రమకేసరి అతడి దగ్గిర కొచ్చి, ‘ఏం శిఖీ! ఆ పూజారి దుర్మార్గుణ్ణి వెంబడించే ప్రయత్నం చేయొద్దా? వాడు మరో



సారి మనందరినీ మోసగించి పారిపోయాడు’ అన్నాడు.

‘వాడు రోజులు మూడిననాడు గాని మన చేతబడడు. ఈ గుడ్డి వెన్నెల్లో వాణ్ణి ఈ మహారణ్యంలో ఎక్కడని వెతుకుతాం? మనకు అనవసర శ్రమ తప్ప ఫలితం ఉండదు. ఇదిగో, ఈ గండుపోతు కూతుర్ని తండ్రికి ఒప్ప చెపితే, మన బాధ్యత తీరిపోతుంది. ఆ తరవాత మనం నిశ్చింతగా మీ తాతగారిని గురించి తెలుసుకునేందుకూ, ఆ శిథిలాలయ రహస్యం ఏమిటో కనుక్కునేందుకూ, బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలకు పోదాం’ అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి కట్లు ఊడతీయగానే లేచి నిలబడబోయి, రక్త ప్రసారం సరిగా జరగక

తెరిచి, శిఖిముఖీ వాళ్లను చూసి, భయంతో కంపించి పోతూ తోటి వాళ్లను నిద్రలేపాలని చూశాడు. వాళ్లు కదలలేదు. శిఖిముఖి వాళ్లను సమీపించి కత్తిపిడితో ఒక్కొక్కణ్ణీ పొడుస్తూ, 'ఇక లేవండి. మీ యజమాని పారిపోయాడు. మీ ముగ్గురి తలలూ రావి చెట్టుకు వేళ్ళాడగట్టబోతున్నాను,' అన్నాడు.

తతిమ్మా ఇద్దరు దొంగలూ కళ్ళు తెరుస్తూనే, శిఖిముఖిని చూసి అదురుకుపోయారు. శిఖిముఖి మరోసారి వాళ్ళకు తలలు నరక బోతున్నట్టు చెప్పాడు. దొంగలు ముగ్గురూ అతడి కాళ్ళా వేళ్ళా పడుతూ, 'ఆ పూజారి దుర్మార్గుడిచ్చిన డబ్బంతా నీకిస్తాం. మమ్మల్ని ప్రాణాలతో వదులు' అన్నారు.

'ఏదీ, ఆ డబ్బు చూపండి?' అన్నాడు శిఖిముఖి.

దొంగలు ఒకరి ముఖాలొకరు చూసుకుని చుట్టూ కలయచూడసాగారు. వాళ్లెవరి కోసం చూస్తున్నారో గ్రహించిన శిఖిముఖి, 'నాలుగోవాడి కోసం చూస్తున్నారా? వాడు కూడా వస్తే గాని, ఆ దాచిన డబ్బు బయటకి తీయటానికి లేదన్న మాట! సరే, బహుశా వాడీపాటికి నరకంలో వుండి వుంటాడు. వాడి వంతు డబ్బు కూడా మీరే పంచుకుని, ఎక్కడినైనా ఇంత పొలం కొనుక్కుని సన్మార్గంలో బతకండి. దొంగల్లా మళ్ళీ ఏనాడైనా నా కంట బడ్డారో, ఆ క్షణానే మీ ప్రాణాలు తీస్తాను,' అన్నాడు.



కాళ్ళు చచ్చుబడటంతో తిరిగి బల్లమీద కూర్చుంటూ, విక్రమకేసరితో, 'ఈ శబర కుర్రాడికి ఆ పూజారి ఎంత జిత్తులమారో ఇంకా తెలిసినట్టు లేదు. వాడు మీకంటే ముందుగా ఆ బ్రహ్మపుత్రా లోయల్లోని శిథిలాలయాన్ని చేరతాడు' అన్నది.

'అక్కడికి వెళ్ళేందుకు అవసరం అయిన దారి గుర్తులూ అవీ ఉన్న పటం గల తాళ పత్రాలు మాదగ్గిర ఉన్నవి. ఆ దారేదో తెలుసుకునేందుకే పూజారి ఆ తాళపత్రాల కోసం ఇంతగా తెగించి ప్రయత్నించాడు. అవి జన్మలో వాడిచేత బడవు' అన్నాడు శిఖిముఖి.

అంతలో గది మూల నిద్రపోతున్న దొంగల్లో ఒకడు పెద్దగా ఆవులిస్తూ కళ్లు

శిఖిముఖి వెంట నాగుమల్లీ తతిమ్మా అనుచరులూ ఇంటి బయటకి వచ్చారు. విక్రమకేసరి, శిఖిముఖితో, 'శిఖీ! పూజారికీ, దొంగలకూ ఆశ్రయం అయిన ఈ ఇంటిని ఇలా ఉండనివ్వడం నాకిష్టం లేదు. వాళ్ళు మరోసారి ఇక్కడ చేరి దుర్మార్గ కార్యాలు చేయవచ్చు. దీనికి నిప్పు పెట్టడం మంచిది' అన్నాడు.

శిఖిముఖి, 'నీ యిష్టం,' అంటూ తల ఊపాడు. విక్రమకేసరి ఇంట్లోకి పోయి వెలుగుతున్న దివిటీ తీసుకుని బయటికి వచ్చి, ఇంటినాలుగు పక్కలా దానితో అంటించాడు. చూస్తుండగానే పెద్ద మంటలు లేచినై. శిఖిముఖీ అతడి అనుచరులూ సంతోషంగా చప్పట్లు చరుస్తూ లోయకేసి బయలుదేరారు. చచ్చినవాడు చావగా మిగిలిన ముగ్గురు దొంగలూ, కాలే ఇంట్లో నుంచి తమకు పనికి వస్తవనుకున్న కొయ్య బల్లలూ వంటపాత్రలూ హడావుడిగా బయటికి తెచ్చుకోసాగారు.

లోయ సమీపంలో ఉన్న పూరిపాక దగ్గిర తిరిగి అంతా కలుసుకున్నారు. సవరగండుపోతు తన కుమార్తెను చూసి పొందిన ఆనందం అంతా ఇంతా కాదు. అతడు నాగుమల్లిని బుజ్జగిస్తూ, 'నిన్నా పూజారి కుక్క ఉత్తరాదికి ఎత్తుకుపోయాడే అనుకున్నాను. అదృష్టం కొద్దీ దొరికావు. ఆ పిచ్చి కుక్కగాణ్ణి ఏదో విధంగా పట్టుకుని కండకు కండ కోసి కాకులకూ గద్దలకూ



వెయ్యకపోతే నేను గండుపోతునే కాదు' అన్నాడతను.

శివాలుడు చిరునవ్వు నవ్వుతూ, 'గండుపోతూ, మనం ఇలాంటి ప్రతిజ్ఞలు చేసి నెరవేర్చుకోగలిగిన స్థితిలో లేం, పెద్దవాళ్ల మయిపోయాం శిఖిముఖీ, విక్రమకేసరీ ముందుగా శూరసేన దేశం వెళ్ళి, విక్రమకేసరి తండ్రిగారితో మాట్లాడి బహుశా అక్కణ్ణించి బ్రహ్మపుత్రా నదీలోయ ప్రాంతాలకు వెళతారు. ఒకవేళ వాళ్లకు తిరిగీ ఆ శిథిలాలయ పూజారినని చెప్పుకునే దుష్టుడు ఎదురైతే, తప్పక వాణ్ణి నీకోసం కాళ్ళూ చేతులూ కట్టి తీసుకువస్తారు. అప్పుడు నువ్వు వాణ్ణి చిత్రహింసలకు గురిచెయ్యవచ్చు' అన్నాడు.

శివాలుడి మాటలకు అందరూ వినో దంగా నవ్వారు. తరవాత సూర్యోదయం అవుతూనే శివాలుడూ, గండుపోతూ తమ వాళ్లను వెంటబెట్టుకుని తిమ్మగూడెం చేరారు. అక్కడ ఆ పగలూ, రాత్రీ వినోదా లతో, విందులతో కాలం గడిపి శివాలుడు మర్నాటి ఉదయం తన కుంభారిమిట్ట పల్లెకు బయలు దేరాడు. అతడు ప్రయాణ మయే సమయంలో నాగుమల్లి, శిఖిము ఖిని ఒక పెద్ద చెట్టుచాటుకు పిలిచి, తనను కాళ్లూ చేతులూ కట్టి హింస పెట్టిన శిధిలా లయ పూజారి శిఖ కావాలన్నది.

'వాడు మాకు ఆ లోయల్లో తటస్థ పడాలే కాని, వాడి తలే నరికి తెచ్చి నీకిస్తా నని వాగ్దానం చేస్తున్నాను. కాని, తిరిగి రావ టానికి ఎంత కాలం పడుతుందో చెప్ప లేను. ఈ లోపల నువ్వు మరొక సవరవాడి పెళ్ళాం అయిపోతే, వాడు నామీద ఈటె ఎత్తుతాడు' అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలు నాగుమల్లికి కోపం, సిగ్గూ కూడా తెప్పించినై, ఆమె తలవంచుకుని నేల చూపులు చూస్తూ, 'నన్ను సవరవాడు కాదు కదా, మరే శబరవాడు కూడా చేసుకో లేడు' అన్నది వణుకుతున్న కంఠస్వరంతో.

'అంటే... నాకేం తెలియటం లేదు' అంటూ శిఖిముఖి అమాయకంగా, నాగు మల్లి ముఖం కేసి చూశాడు.

నాగుమల్లి ఏదో చెప్పబోయింది, కాని అంతలో శివాలుడు పెద్దగా 'ఊ, ఇక అందరూ బయల్దేరండి, శిఖిముఖి ఎక్కడ?' అన్నాడు.

నాగుమల్లి చప్పున కదిలి ఇంటి కేసి పరిగెత్తింది. ఎర్రగండు అరుస్తూ శిఖిముఖి దగ్గరకు వచ్చింది. శిఖిముఖి దాని తల నిమిరి నాగుమల్లి అన్న మాటల్లోని భావ మేమిటా అని ఆలోచిస్తూ తండ్రి దగ్గరకు బయలుదేరాడు.

(ఇంకా ఉంది)






# రాలినపువ్వు

అది పౌరుషశాలి మహారాణాప్రతాప్ పరిపాలించే కాలం. అక్బరుపాదుషా చక్రవర్తిగా వచ్చిన కాలం. సామంతులందరూ చక్రవర్తికి లొంగారు. ప్రతాప్ మట్టుకు లొంగిరాలేదు. అక్బరు క్రోధపూరితుడైనాడు. రాణా పట్టుదల వహించాడు.

రాణా చూపే స్వాతంత్ర్యేచ్ఛను అక్బరు సహించలేకపోయాడు. కష్టాలెన్నో కల్పించాడు. అయినప్పటికీ రాణా అణుమాత్రం తలవంచలేదు. దాంతో చక్రవర్తికి బెదురు పుట్టింది. ఎలాగైనా సరే రాణాను సాధించి తీరవలెనని నిశ్చయించాడు. రాణాలోని స్వాతంత్ర్యజ్వాల మరింత విజృంభించింది. ఆఖరుకు చక్రవర్తి కార్పణ్యం వహించి మహారాణాను అడవులపాలు చేసివేశాడు!

ఒక్క తనప్రాణమే పోతే, రాణా లెక్క చేయకపోను. తనతో పాటు కట్టుకున్న భార్యా, కన్న బిడ్డలు కష్టపడవలసిరావడం అతనికి హృదయ శల్యమై వేధించింది. చక్రవర్తి చేతికింద బానిసగా ఉండటమా? అడవులలో స్వతంత్రమైన గాలి పీల్చుకోవటమా?

ఈ సమస్యతో రాణా మనస్సు వేగిపోయింది. రెండవమార్గమే మంచిదని ఎంచుకొన్నాడు. రాణా మాత్రమే కాదు. ఆయన సతి సుగుణాంబ పదకొండేళ్ల పుత్రి చంపావతి, నాలుగేళ్ళ పిల్లవాడు సుందరసింగూ అందరకూ ఈ మార్గమే ఇష్టమయింది. నాటి నుంచి రాణా కుటుంబం అడవులలో తలదాచుకుంటూ అజ్ఞాతంగా కాలక్షేపం చేయసాగారు.

ఎమ్.ఎస్.శాస్త్రి





చేతులతో మరలిపోవటమా! ఇటువంటి సంఘటన కలగటం నా జీవితంలో ఇదే మొదటిసారి. రాజస్థానానికంతటికీ మకుటాయమానంగా వెలిగిన మన చిత్తూరు ప్రభువులకే తలవంపు కదా ఇది? ఛీ! జాతికే మచ్చతెచ్చిన నేను బ్రతికేం, చచ్చేం!' అని వాపోతూ సోలిపోయాడు.

భర్తకు సుగుణ అనేక ఉపచారాలు సలిపింది. కొంచెం తేరుకున్నాడు. 'ఇంత వరకూ ఏ విషయమూ నా కింతటి దుఃఖాన్ని కలిగించలేదు సుగుణా! నెలల తరబడి వస్తులున్నా నాకు బాధ కలగ లేదు. మన అక్షయుడు ఆకటి బాధతో చచ్చిపోయినా నేను పట్టించుకోలేదు. అన్నమో! అన్నమో అని విలపిస్తూ మన స్వర్ణ మనలను వీడినప్పుడూ నేను ధైర్యం వదలలేదు.

కాని.. కాని... ఈనాడు ఒక బ్రాహ్మ ణుడు నా కుటీరం నుండి ఆకటి పొట్టతో వెళ్లి పోవలసి వచ్చిందంటే.. ఎంత అవ మానం! ఎంత శిరచ్ఛేదం!!' ఇలా అంటూ మళ్ళీ స్మృతి తప్పి పడిపోయాడు.

అంతలో చంపావతి తమ్ముని వెంట బెట్టుకుని తండ్రివద్దకు చక్కా వచ్చింది. 'దిగులుపడకండి నాన్నగారు! మీరను కొన్న బ్రాహ్మడు ఉత్తచేతులతో వెళ్ళిపో లేదు. స్నానానికి వెళ్ళాడు. ఇప్పుడే తిరిగి

బిడ్డలిద్దరూ లోకం మరచి అడవులలో ఆడుకునేవారు, చంపావతి పువ్వుల దండలు గుచ్చి చిట్టితమ్ముని మెడలో వేసి ఆనందించేది. ఒకనాడు పాపం పసివాడు, ఆకలికి ఓర్వలేక రాగాలు పెట్టాడు. అప్పుడు చంపావతి, 'తమ్ముడూ! ఈ పాటిదానికేనా ఏడుపు!' అంటూ ఊర డించి కుటీరం లోపలకు ఎత్తుకు తీసు కెళ్లింది.

మహారాణా ప్రతాప్ ఆయన సతీమణి సుగుణాంబా ముతుక గుడ్డలు ధరించి, దీనవదనాలతో కూర్చుని ఉన్నారు. ఉండి ఉండి ప్రతాప్ పెద్దగా నిట్టూర్చాడు. 'సతీ! చూచావా విధివిలాసం? ఒకానొక బ్రాహ్మ ణుడు మన ఇంటికి అతిథిగా వచ్చి, ఉత్త

వస్తాడు. ఆయనకు భోజనం పెట్టి పంపించే బాధ్యత నాది' అని ధీమాగా చెప్పింది.

ఆశ్చర్యపోయాడు రాణా. చంపావతిని చేరదీసికొన్నాడు. 'నా కీర్తి నిలబెట్టావు చిట్టితల్లీ! అవును గాని, బ్రాహ్మణ్ణి ఎలా తృప్తి చేస్తావమ్మా? నాకేమీ బోధపడటం లేదు!' అని ఆత్రంగా అడిగాడు.

'నాన్నగారూ, రెండు రోజుల నుండీ నా వంతు రొట్టెలు అలానే ఉండిపో యాయి. అవి ఆయనకు వడ్డిస్తా. ఆయన తిరిగి వచ్చేలోపల, మనకు అడవిలో దొరికే ఆకులతో ఆదరువు కూడా తయారు చేసి ఉంచా. ఇంక భయమెందుకు నాన్న గారూ!' అన్నది.

మహారాణా కన్నుల నుండి అప్రయ త్నంగా బాష్పాలు రాలినై.

స్నానం చేసుకువచ్చాడు బ్రాహ్మడు. కూర్చునేందుకు చదర వేసే ఉంచింది చంపావతి. ఆయన కూర్చోగానే రొట్టెలు వడ్డించి పచ్చడి వేసింది. ఆప్యాయంగా ఆరగిస్తున్నాడు బ్రాహ్మడు. 'స్వామీ అడ వులలో ఉండేవాళ్లం. ఇంతకంటే ఏమీ చేసిపెట్టలేకపోయాం' అన్నది చంపావతి వినయం ఉట్టిపడుతూ.

'అమ్మా! అలా అనుకోవద్దు. ఇంత తృప్తికరమైన భోజనం నేను నా జీవితం లోనే ఎరగను. సుఖంగా ఉండు తల్లీ!'




అంటూ దీవించి వెళ్ళిపోయాడు బ్రాహ్మడు. ఈ వార్త తండ్రికి చెబుదామని లోపలికి వెళ్లింది చంపావతి. కాని నీరసం చేత సోలిపోయింది. నోటమాటే లేకపోయింది.

రాణా వచ్చి చూచాడు. సుగుణవతి పక్కన కూర్చుంది. తల్లడిల్లిపోయాడు రాణా. ఆయన మనసు వికలమైపో యింది. 'సుగుణా! దయగల పాదుషా కబురు పంపాడు. రాజీకి రమ్మని...' అన్నాడు.

అంతలో బయట అడుగుల చప్పుడ యింది. పాదుషా మనుషులే ఐవుంటారు, అన్నాడు మళ్ళీ రాణా, కొత్త జవంతో.

వణికిపోతున్న పెదవులతో, కంపించి పోతున్న శరీరంతో చంపావతి గభీమని

లేవబోయింది. లేవలేక పడిపోయింది. 'నాన్నగారూ? పాదుషా దయ ఇప్పుడా తెలిసివచ్చింది మీకు? రేపు తన ఆస్థా నంలో పెద్ద ఉద్యోగమిస్తాడు. ఎల్లుండి మళ్లీ బానిసగా చేసుకుంటాడు. ఇదేనా మీ తృప్తి? రాజపుత్ర పౌరుషం మంట కలిసిపోవటమేనా? వంశగౌరవం నాశనం చేస్తారా నాన్నా?

హల్దీఘాట్ యుద్ధంలో రాణాబిడ్డలు సింహపు కొదమలు సుమా, అని అక్బరుకు మచ్చు చూపించాము కదా. ఈనాడు రాజీ అనే వలలో రాణా పడ్డాడంటే సిగ్గు చేటు కదా!' అని ఆవేశంతో గబగబ పలికి, పడిపోయింది. స్మృతి తప్పిపోయింది.

వలవల ఏడ్చాడు రాణా. 'అమ్మా! చంపా!! అటువంటి నీచానికి రాణా ఒడంబడడు, నమ్ము. నీ బాధ చూడలేకనే అలా తప్పుడుమాటలన్నాను. నిశ్చింతగా ఉండు తల్లీ! అక్బరుకు ఎన్నడూ లొంగను నమ్ము!!' అనగానే, చంపావతి శాశ్వతంగా కన్నుమూసింది!!!

అంతలో బయటినుండి, 'నిజం, నిజం! అక్బరుకు లొంగకూడదు!!' అని ఒక వాణి వినిపించింది. రాణా విస్మ యంతో చూసేటంతలో బ్రాహ్మడు మళ్ళీ వచ్చాడు. రాణాచేతిని తన చేతిలో ఉంచు కున్నాడు.

చంపావతిని చూసి బొటబొటా కన్నీళ్ళు రాలుస్తూ, 'రాణా! పరమపవిత్రమైన ఈ పువ్వు రాలిపోవడానికి కారణమైన మహా పాపి వీడే. వీడే అక్బరు. ఈమె పేరు స్వర్ణా క్షరాలతో అప్పుడే చరిత్రకు ఎక్కిపో యింది. నీకు గాని నాకు గాని ఇంత కంటే కావలిసిందేముంది? ఈ చంపావతి సమక్షమందు దేవుని సాక్షిగా చెబుతున్నా! ఇంతటినుండి మనకు వైరం లేదు. నీ రాజ్యం నీవు నిశ్చింతగా ఏలుకో!' అంటూ రాణాను ప్రేమతో చేరదీసుకున్నాడు.





# చక్కెర మాటలు

పూర్వకాలమందు శ్రీపతి అనే మహా భక్తుడు ఉండేవాడు. ఆయన సకల శాస్త్రాలూ నేర్చినవాడు. సాధుపుంగవుడు, మంచి వైరాగ్యుడు. ఆయన సతి శ్యామ లాంబ, శ్యామల భర్తకు అనుకూలవతి, పతివ్రత, ఉత్తమురాలు, పూతచారిత్ర, గొప్ప జ్ఞాని.

ఆ పుణ్య దంపతులకు లేకలేక వర ప్రసాదుడైన ఒక సుపుత్రుడు కలిగాడు. వానికి లోకవిలక్షణంగా షేక్ ఫరీద్ అని పేరు పెట్టి అల్లారుముద్దుగా, అపు రూపంగా పెంచుకుంటున్నారు.

ఇలా ఉండగా ఒకనాడు, దేవార్చన కోసం పూజా పుష్పాలు తీసుకువద్దామని శ్రీపతి బయలుదేరి అడవికి వెళ్లాడు. అక్కడ పువ్వులు కోస్తూ ఉండగా గొప్ప దైన విషసర్పమొకటి అతనిని కాటు వేసింది. శ్రీపతి గబగబ ఇంటికి చేరుకుని, స్నానం చేసి, భగవధ్యానంతో తులసితీర్థం పుచ్చుకొన్నాడు. భార్యను పిలిచి, జరిగిన వృత్తాంతమంతా చెప్పి, పరమార్థతత్వం ఉపదేశించాడు. మూడేళ్ళ కొడుకును చేరదీసికొని దీవించి, అటుతరవాత పర మేశ్వరుని సాన్నిధ్యం చేరుకున్నాడు.

విధివిలాసం తప్పదు కదా! అనేసంగతి గుర్తుకు రాగా, శ్యామల దుఃఖం దిగమిం గుకొని బాలుణ్ణి ఐదేళ్ళవరకు జాగర్తగా పెంచింది.

షేక్ ఫరీదు హరినామ సంకీర్తనలలో పాల్గొంటూ తండ్రిలాగానే మహా భక్తుడ య్యాడు. బాలభక్తుడైన ఫరీదు ఒక రోజున తల్లివద్దకు వచ్చి, 'అమ్మా! భగవం

వై. దక్షిణామూర్తి




తుని అందరూ అనేక విధాల వర్ణించి పొగడుతున్నారే? ఆయన నాకు కనబడ డేమి? అని ప్రశ్నించాడు. అందుకు తల్లి 'బిడ్డా! తపస్సు చేసినవారికి శ్రీహరి ప్రత్యక్షమవుతాడని పెద్దలంటారు' అని చెప్పింది.

అంతట బాలభక్తుడైన ఫరీదు ప్రపంచ విషయాలన్నిటినీ వదిలివేసి, అరణ్యా లకు పోయి, ఘోరతపస్సు చేయడానికని బయలుదేరాడు.

అలా బయలుదేరిపోతున్న తన ముద్దు కుమారునికి ప్రేమకొద్దీ తల్లి ఒక రొట్టె ముక్క చేసి ఇచ్చింది. ఐతే ఆ రొట్టెలో ఉప్పు ఐనా వేయక, చప్పగా తయారు చేసింది. తల్లి ఇచ్చిన ఆ రొట్టె ముక్కను నడుముకు కట్టిపెట్టుకొని ఫరీదు అర ణ్యాలకు పోయాడు.

అక్కడ అతను తీవ్రంగా తపస్సు ప్రారంభించాడు. ఆకలిబాధ ఎక్కువగా ఉంటే తల్లి ఇచ్చిన రొట్టె తినవచ్చు కదా అనుకున్నాడు. కాని, ఆ సంగతే మరిచి పోయాడు.

తరువాత చెట్లఆకులు చూసుకొని ఆకటి బాధను మాన్పుకొంటూ, అలా ఎంతకాలమో తపస్సు చేశాడు. ఐనా భగవంతుడు కానరాలేదు.

షేక్ ఫరీదు పట్టు వదలక మరింత గాఢంగా తపస్సు చేయసాగాడు. కొన్నా ళ్ళకు ఒక వర్తకుడు, ఏవో మూటలు బండిపైన వేసుకొని ఆ దారినపోతూ, బడ లిక తీర్చుకొందామని అక్కడ విశ్రమిం చాడు. ఫరీదు అతనిని కుశలప్రశ్నలు వేస్తూ, మూటలకేసి చూశాడు.

చూడగానే, అవన్నీ చక్కెర మూటలైతే ఎంత బాగుండును! నా వద్ద ఉన్న రొట్టెను అద్దుకు తినవచ్చు కదా, అని మనసులో ఒక భావం కలిగింది. కలిగి 'మూటలలో ఏమున్నదండీ?' అని ఫరీదు అడిగాడు. ఇందుకు వికటంగా వర్తకుడు 'అవన్నీ ఇసుకమూటలయ్యా' అని బదులు చెప్పాడు.

అటు తరవాత వర్తకుడు ఇంటికి పోయి, తీరా మూటలు విప్పి చూసుకునే సరికి ఇకనేముంది? వాని నోటివాక్యం

ఫలించిందా అన్నట్టు ఆ మూటలలో అంతా ఇసుకే కానవచ్చింది!

వర్తకుడు గుండె బాదుకొంటూ, వెంటనే తన మూటలతో సహా ఫరీదు వద్దకు తిరిగివచ్చి, అతని కాళ్ళపైన పడ్డాడు.

'మహాత్మా! నా చక్కెర మూటలన్నీ ఇసుకమూటలుగా మారిపోయినై. నిన్న వెటకారం చేసినందుకు తగినశాస్తి అయింది. నా అపరాధం క్షమించు' అంటూ వేడుకొన్నాడు.

అందుకు ఫరీదు 'నాయనా! నేనేమీ ఎరగనోయి' అంటూ ఎన్నోవిధాల వర్తకునికి నచ్చచెప్పాడు. ఎంత చెప్పినా అతడు నమ్మలేదు.

అప్పుడు ఫరీదు వర్తకునితో 'అయ్యా! నా మాటచేతనే నిజంగా నీ చక్కెర ఇసుకగా మారిపోయిందా? అలానే అయినట్లయితే శ్రీహరి కృప వల్ల ఇప్పుడు ఆ ఇసుక మళ్ళీ చక్కెరగా మారిపోవు గాక!' అని అనగానే, ఆ ఇసుక మూటలన్నీ మళ్ళీ చక్కెరగా మారిపోయినై. వర్తకుడు సంతోషించి, ఫరీదుకు కావలసిన చక్కెర ఇచ్చి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత షేక్ ఫరీదు కఠిననియమాలతో మళ్ళీ తపస్సు సాగించాడు. ఐనా శ్రీహరి దర్శనమీయలేదు. శ్రీహరి కృప కలగనందుకు విచారించి, ఫరీదు ఇంటికి వెళ్ళి, నిస్పృహతో తల్లిని చూసి ఏడ్చాడు.



తల్లి శ్యామల సంగతి అంతా తెలుసుకుని, కొడుకును తల నిమురుతూ, జటలు కట్టిన అతని తలనుంచి ఒక చిన్న జడ పట్టుకులాగింది. అప్పుడు ఫరీదు 'అమ్మా! ఇప్పటికే నేను సగం చచ్చి ఉన్నాను. నన్నింకా ఎందుకు బాధిస్తావు' అని ప్రశ్నించాడు.

అందుకు తల్లి, 'బిడ్డా! ఒక్క చిన్న జడ పట్టుకు లాగితేనే నీకింత నొప్పి కలిగిందే, నీవు తపస్సు చేసే కాలంలో ఆహారంకోసం చెట్లనుండి ఒక్కొక్క ఆకూ దూసినప్పుడు వాటికెంత బాధ కలిగి ఉంటుందో ఆలోచించావా? నీవు చేసిన తపస్సు హింసతో కూడుకున్నది. పైగా నీవు, తపస్సు చేస్తున్నా కూడా నీకు రొట్టెరుచి, చక్కెర రుచీ మన

సులో మెదులుతూనే ఉన్నవాయె! అటు వంటప్పుడు భగవంతుడు నీకు ఎలా ప్రసన్నుడవుతాడు?' అని అన్నది.

ఆ వెంటనే ఫరీదు, తల్లి ఉపదేశం ప్రకారం మళ్ళీ అడవులకు పోయి, కదలక మెదలక, ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ, కొయ్యబారిపోయినా దీక్ష మానక తపస్సు సాగించాడు.

అప్పుడు భగవంతుడు సాక్షాత్కరించి, కృప చూపుతూ, 'వత్సా! నీవింటికి పోయి, సద్గురువులను ఆశ్రయించి వారి అనుగ్రహం సంపాదించు. నేను ఎల్లప్పుడూ నీకు సన్నిహితుడనయే ఉంటాను' అని పలికి అంతర్థితుడయ్యాడు.

షేక్ ఫరీదు వెంటనే ఇంటికి పోయి, జరిగినదంతా పూసగుచ్చినట్టు తల్లికి వినిపించాడు. తల్లి ఎంతగానో సంతోషించింది.

అటుపిమ్మట షేక్‌ఫరీదు ద్వారక మొదలైన తీర్థస్థలాలు సేవించుకుంటూ, భగవదర్చకుల దివ్యదర్శనం చేసుకుంటూ, కొంత కాలానికి మళ్ళీ ఇల్లు చేరుకొని తల్లితో కూడా సుఖంగా ఉంటూ ఉండగా--

ఆ దేశపు రాజు ఫరీదు ఇంటికి వచ్చి, తనకు జన్మాంతర పాపఫలం వల్ల కలిగిన ఒక వ్యాధిని పోగొట్టుమని వేడుకున్నాడు. షేక్‌ఫరీదు ఆ రాజును ఆపాదమస్తకమూ తన చేతితో తడవగా, ఆ క్షణమందే అతనికి వ్యాధి నయమైపోయింది.

ఇందుకు ఆ రాజు ధన కనక వస్తు వాహనాలతో ఫరీదును గౌరవించబోగా ఫరీదు వద్దన్నాడు. 'అయితే నేను ఇక్కడే ప్రాణ త్యాగం చేస్తా'నని భీష్మించాడు రాజు.

ఆ రాత్రి పాండురంగడు ఫరీదుకు దర్శనమిచ్చి, ఆజ్ఞ ఇవ్వగా, రాజు ఇచ్చే ధనాన్ని స్వీకరించి, ఆ ధనంతో భాగవతులకు సమారాధనలు జరిపించాడు.





ఫొటోగ్రఫీలో ప్రొఫెషనల్ డిగ్రీతోపాటు విస్తృతమైన, వైవిధ్యపూరితమైన పని అనుభవం ఉంటే ఈ రంగంలో విజయం దక్కుతుంది. భారతదేశంలో కొన్ని ఫ్యాషన్ ఫొటోగ్రఫీ ప్రోగ్రామ్‌లు ఉన్నాయి. ఫొటోగ్రఫీలో లాంఛనప్రాయ శిక్షణను పాలిటెక్నిక్, వొకేషనల్ ట్రెయినింగ్ ఇనిస్టిట్యూట్, ఆర్ట్ కాలేజ్ (బి. ఎ, విజువల్ ఆర్ట్ లేదా అప్లయిడ్ ఆర్ట్) లేదా ఫ్యాషన్ ఇనిస్టిట్యూట్‌లలో పొందవచ్చు. ఫొటోగ్రఫీలో ప్రొఫెషనల్ డిగ్రీ లేదా డిప్లొమాను అందించే కొన్ని సంస్థల జాబితాను ఇక్కడ పొందుపర్చడమైనది–

- University of Lucknow – www.lkouniv.ac.in/cour_fin_art.htm
- Deendayal Upadhyaya Gorakhpur University, Gorakhpur – www.ddugu.edu.in/courses.htm
- RGSC, Deptt. of Applied Arts, Faculty of Visual arts, BHU, Varanasi – www.bhu.ac.in
- National Institute of Design, Ahmedabad – www.nid.edu
- National Institute of Fashion Technology, Navi Mumbai – www.nift.ac.in
- National Institute of Photography, Mumbai – www.focusnip.com/home_0.html
- Asian academy of film and television, Noida – www.aaft.com

ఫ్యాషన్ ఫొటోగ్రఫీపై అజిత్‌తో సమగ్ర సంభాషణ జరపడమైనది, ఈ అంశంపై చాలా వివరాలు మనం తెలుసుకోగలిగామని నేను భావిస్తున్నాను. కాబట్టి ఫొటోగ్రఫీపై ఆసక్తిగలవారు, దాంట్లో కెరీర్‌ని వృద్ధి చేసుకోవాలనుకుంటున్న వారికి నా సలహా ఏమిటంటే ముందడుగు వేయమనే.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 32

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -32 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. డిసెంబర్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## పర్యాటకం



1. ప్రపంచపర్యాటకదినం ఎప్పుడు జరుపుతారు?
2. మహత్తరమైన ఇంకా నగరం మచూ పిచ్చూ శిధిలాలు ఏ దేశంలో ఉన్నాయి?
3. భారతదేశంలోని ఏ రాష్ట్రంలో ఉలక్ సరస్సు నెలకొని ఉంది?
4. హైదరాబాద్‌లో ప్లేగ్ వ్యాధి నిర్మూలనకు చిహ్నంగా 1591లో నిర్మించిన సుప్రసిద్ధ కట్టడం ఏది?
5. 'కలాంగూట్' బీచ్ ఎక్కడ ఉంది?
6. దేవుడి సొంత దేశంగా గుర్తించబడుతున్న భారతీయ రాష్ట్రం ఏది?
7. మనదేశంలో 'గులాబీ నగరం' అని దేనికి పేరు?
8. ఉత్తరఖండ్ రాష్ట్రంలో క్వీన్ ఆఫ్ హిల్స్ గా పేరొందిన పర్వత ప్రాంత స్టేషన్ పేరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-29 సమాధానాలు:

1. న్యూరాన్‌లు, 2. మోటారు సంకేతాలు, జ్ఞానేంద్రియ సంకేతాలు, 3. మెదడు 4. పది బిలియన్ నాడీ కణాలు, 5. కేంద్ర నాడీవ్యవస్థ, 6. పెద్ద మెదడు,చిన్న మెదడు, మధ్య మెదడు, 7. పెద్ద మెదడు.

*జూన్'11 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.*



# నవ్వుల పువ్వులు



*అమ్మ:* రంజిత్, నేనిచ్చిన డబ్బును ఎందుకు మింగేశావ్?
*రంజిత్:* అది నా లంచ్ డబ్బు మాత్రమే అని నువ్వే చెప్పావు గదమ్మా!



*టీచర్:* నా ఒక చేతిలో ఏడు ఆపిల్ పళ్ళు, మరో చేతిలో ఎనిమిది ఆపిల్ పళ్లు ఉన్నట్లయితే నా వద్ద ఏమి ఉన్నట్లు?
*రోషన్:* మీకు పెద్ద చేతులు ఉండవచ్చు.



ఒక ప్యాసింజర్, పైలట్ ఇద్దరూ విమానంలో ఉన్నారు. ఉన్నట్లుండి పైలట్ పిచ్చిగా నవ్వసాగాడు.
*ప్రయాణీకుడు:* ఎందుకు నవ్వుతున్నారు?
*పైలట్:* నేను తప్పించుకున్నానని కనుగొన్నప్పుడు శరణాలయం వారు ఎలా ఫీలవుతారో అని ఆలోచిస్తున్నా.



*రక్షిత:* ఆమెకు చెప్పవద్దని నేను నీకు చెప్పిన రహస్యాన్ని తనకు చెప్పావని ఆమె చెప్పింది.
*వందన:* హూ! ఆమెకు నేను చెప్పిన విషయాన్ని నీకు చెప్పవద్దని నేను ఆమెకు చెప్పాను.
*రక్షిత:* ఆమె నాకు చెప్పేసిందని నేను నీకు చెప్పిన విషయం ఆమెకు చెప్పవద్దు.



*సుందర్:* నీ వేలికి చుట్టిన దారం ఏమిటి?
*రాజు:* అమ్మ రాసిన ఉత్తరాన్ని నేను పోస్టులో వేయాలని ఆమె నా వేలికి దారం చుట్టిందిరా.
*సుందర్:* మరి నీ చూపుడు వేలికి చుట్టిన దారం మాటేమిటి?
*రాజు:* ఉత్తరాన్ని ఎయిర్ మెయిల్ చేయాలని గుర్తు చేసుకోడానికి దాన్ని చుట్టిందిలే.

రాజ ఫలహారం

# నోరూరించే కేక్ – శతాబ్దాల చరిత్ర





ప్రాచీన కాలంలో, అసాధారణ సంప్రదాయాలలో కేక్‌లు భాగమై ఉండేవి. యూరప్‌లోని సెల్టిక్ భాషా కుటుంబానికి చెందిన ప్రజలు, వేసవి ప్రారంభాన్ని సూచిస్తూ బెల్టేన్ పండుగను జరుపుకునేవారు. ఈ సందర్భంగా కొండలపై భాగంలో నెగళ్లు వెలిగించి గుండ్రటి కేక్‌లను కొండపైనుంచి జారవిడిచేవారు. సూర్య గమనాన్ని అనుకరించడానికి ఇలా చేసేవారు. కొండపైనుంచి జారిపడినప్పటికీ కేక్ చెక్కుచెదరకుండా ఉంటే అది సంపదకు, సౌభాగ్యానికి చిహ్నమని విశ్వసించేవారు!



చైనీయులు అమర దేవత  హెంగ్ ఒ గౌరవార్థం చంద్రుడి రూపంలో కేక్‌లు తయారు చేసేవారు. మంగోలియన్ పాలకులను కూలదోయడానికి మింగ్ విప్లవకారులు ఒక పుకారు వ్యాపింపజేశారు. రాజ్యంలో ప్రాణాంతకమైన ప్లేగు వ్యాధి వ్యాపిస్తోందని, చంద్రకేక్‌లు తినడమొక్కటే దాన్ని నివారిస్తుందని ఈ పుకారు సారాంశం. పజిల్ రూపంలో కేక్ పైభాగంలో రహస్య సందేశాలుండేవి. వాటిని ప్రజలు చదివేందుకు అనుకూలంగా ఉండేవి.



చీజ్ కేక్ గురించి మీరేమనుకుంటున్నారు? క్రీస్తు పూర్వం 776లో గ్రీసులో తొలి ఒలింపిక్ క్రీడల సందర్భంగా క్రీడాకారులకు చీజ్ కేక్‌లు అందించేవారు. గ్రీకుల నుంచి అది రోమన్లవద్దకు చేరింది. తర్వాత యూరప్, అమెరికా ప్రాంతాలకు చేరింది.



కేకులపై కొవ్వొత్తులను వెలిగించే సంప్రదాయం 15వ శతాబ్దంలో కిండర్ ఫెస్ట్ అనే జర్మన్ సంప్రదాయం నుంచి వచ్చింది. పిల్లల జన్మదినం చాలా ప్రత్యేకంగా భావించబడేది. కాబట్టి స్నేహితులు, కుటుంబ సభ్యులు కేకు చుట్టూ రక్షణగోడలాగా నిలబడేవారు. కేక్‌పై కొవ్వొత్తులు వెలిగించి సాయంకాలం దాన్ని వడ్డించే వరకు వాటిని ఆరిపోకుండా కాపాడేవారు.




ఊపీ పూర్ణాలు అనేవి మధ్యభాగంలో గడ్డరూపంలోని క్రీమ్ పొరను కప్పి ఉంచిన కేక్‌లు. వీటికి ఆ పేరు ఎలా వచ్చింది? అమిష్ జాతి మహిళలు ఈ పూర్ణాలను వండి ప్రత్యేక వంటకంలాగా వీటిని రైతుల భోజనం డబ్బాలో పెట్టారు. తరవాత రైతులు తమ భోజనం డబ్బాలను విప్పి ఈ పూర్ణాలను చూశారట. అంతే, వాళ్లు సంతోషం పట్టలేక 'ఊపీ' అని అరిచేశారట. అప్పటినుంచి దీనికి ఊపీ అని పేరు పడింది.



స్టేక్ కేక్  అంటే ఒక ప్రత్యేకమైన పెళ్లి కేక్. వధూవరుల కుటుంబ సభ్యులు, స్నేహితులు ఒక్కొక్కరు ఒక్కొక్క కేక్ పొరను తీసుకువస్తారు వీటి మధ్యలో ఆపిల్ మీగడను ఉంచి ఒకదాని పైన ఒకటి పేర్చుతారు. అలా పేర్చిన కేక్ ఎంత పెద్దదిగా ఉంటే వధూవరులు అంత గొప్పవారుగా పరిగణించబడేవారు!



18వ శతాబ్ది ప్రారంభంలో, పళ్లకేక్‌లను దాదాపుగా నిషేధించారు. ఎందు కంటే ఇవి దుష్టశక్తులతో కూడి ఉన్నాయని నమ్మకం. అయితే ఇవి 19వ శతాబ్దంలో తిరిగి ప్రాచుర్యంలోకి వచ్చాయి. ఇంగ్లండ్‌లో, పెళ్లికాని అతిథి దిండు కింద ఒక పళ్లకేక్ ముక్కను ఉంచే సంప్రదాయం ఉండేది. అలా ఉంచితే అతడు/ఆమె తాను పెళ్లాడే వ్యక్తి గురించి కల కంటారట. వీటినే వాచ్యంలో తియ్యటి కలలు అనవచ్చు.



అతిపెద్ద పరిమాణంలో ఉండే ‘బాబ్కా’ కేక్‌ని పంటకోతల కాలంలో స్లావిక్ ప్రజలు సాంప్రదాయికంగా తయారుచేసేవారు. నిజంగా ఇది విలువైన కేక్. వంటగత్తెలు పిండివంటను, ఓవెన్‌లో ఉంచే ముందు బాతుఈకలపై ఉంచుతారు. కేక్‌ని చేసే సమయంలో వంటగదిలోకి పురుషులను అనుమ తించరు.  అలాగే కేక్‌ని తయారు చేసేటప్పుడు ఎవ్వరూ కనీసం గుసగుస లాడకూడదు.



ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లలో లామింగ్టన్ కేక్‌లు బాగా ప్రజాదరణ పొందాయి (చార్లెస్–రెండవ బారన్ లామింగ్టన్ పేరుతో ఇవి ప్రాచుర్యం లోకి వచ్చాయి). పురమాయించిన వెంటనే తయారు చేయబడిన ఈ కేక్‌లు లామింగ్టన్ రాజు అతిథుల ప్రశంసలందుకున్నాయి. అయితే ఆశ్చర్యకరమైన విషయం మరొకటుంది. తన పేరుతో తయారుచేసిన ఈ వంటకాన్ని లామింగ్టన్ తీవ్రంగా వ్యతిరేకించాడట.



ఒకసారి, ఓ మహిళ ఎర్ర ముఖమల్ కేక్‌పై ఇష్టపడిందట. ఒక హోటల్‌లో కూర్చుని ఆమె ఈ కేక్‌ని ఆబగా తెప్పించుకుని తిన్నదట. తాను తిన్న కేక్‌కు వంద డాలర్ల బిల్లు చూపడంతో ఆమె ఆగ్రహించి, ఆ భారీ హోటల్‌లో వందలాదిమంది చూసేలా ఆ కేక్‌ను విసిరివేసిందట.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | What you say is true. | It didn't occur to me at that time. |
|---|---|---|
| Telugu | మీరు చెప్పింది నిజం. | ఆ సమయంలో నాకు అలా జరగలేదు. |
| Hindi | तुमने जो कहा, सच है।<br>తుమ్‌నె జో కహా, సచ్ హై | मुझे उस समय यह नहीं सूझा था।<br>ముజె ఆజ్ సమయ్ యహ్ నహీ సోఝా థా. |
| Tamil | நீ சொல்வது உண்மை.<br>నీ సొల్వదు ఉన్మయ్ | எனக்கு அப்போது தோன்றவில்லை.<br>ఎనక్కు అప్పోదు తోన్రవిల్లయ్ |
| Bengali | আপনি যা বলছেন তা সত্য।<br>ఆపని జా బొల్ఛెన్ థా సోట్యో. | তখন এটা আমার মাথায় আসেনি।<br>థఖోన్ ఎటా అమారా మాథాయె ఆసెని. |
| Marathi | तुम्ही सांगताय ते खरं आहे.<br>తుంహి సాంగత్య టె ఖర్ ఆహె . | त्यावेळी मला ते सुचलं नव्हतं.<br>మల ట్యావెలి టె సుచాల్ నవత్ |
| Kannada | ನೀವು ಹೇಳಿದ್ದು ನಿಜ.<br>నీవు హేళిద్దు నిజ. | ಆ ಸಮಯದಲ್ಲಿ ನನಗೆ ಹಾಗೆ ಆಗಿರಲಿಲ್ಲ.<br>ఆ సమయదల్లి ననగె హాగె ఆగిరలిల్ల. |
| Oriya | ତୁମେ ଯାହା କହୁଛ ସତ।<br>తుమె యాహా కహుచ్చా సటా | ସେଥର ମୋ ସହିତ ଏମିତି କିଛି ଘଟି ନଥିଲା।।<br>సెతర మో సహిత ఎమిటి కిచ్చి ఘటినథిలా |
| Gujarati | તમે જે કહ્યું તે સાચું છે.<br>టేమ్ జె కాయున్ టె సాచున్ చ్చె. | તે સમયે તે મારી સામે આવ્યું નહોતું.<br>టే సమయె టె మారే సామె ఆవ్యున్ నహోటున్. |
| Assamese | তুমি যি কোৱা সেইটো শুদ্ধ।<br>తుమి జి కువ సైయిటు శుద్ధ. | সেই সময়ত কথাটো মই ভৱাই নাছিলো ।<br>సైయి స్మోమోయెట్ కథుటు మోయి భబయి నఛిలు. |
| Malayalam | നിങ്ങൾ പറയുന്നത് ശരിയാണ്.<br>నీంగల్ పరయున్నథు సరియను. | ആ സമയത്ത് എനിക്കത് സംഭവിച്ചില്ല.<br>ఆ సమయతు ఎనికతు సంభవిచిల్లా |
| Santali | ᱟᱢᱟᱜ ᱢᱮᱱ ᱥᱟᱹᱨᱤ ᱜᱮᱭᱟ।<br>అమగ్ మెన్ సరి గెయా. | ᱩᱱ ᱡᱚᱜ ᱫᱚ ᱱᱚᱣᱟ ᱵᱮ ᱪᱤᱠᱟ. ᱤᱧᱟ।<br>ఉన్ జోగ్ దో నోవా బే చికా ఇంజా. |
| Sanskrit | त्वया यदुक्तं तद् सत्यमेव।<br>త్వయ యదుక్తం తత్ సత్యమేవ. | तस्मिन् समये तथा न अभासत।<br>తస్మిన్ సమయే తథా న అభాసత్. |

తెలుగు భాష వినసొంపుగా ఉండే పదాలకు పెట్టింది పేరని మీకు తెలుసా? దీన్ని ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అని అంటారు. తెలుగులో దాదాపు ప్రతి పదమూ అచ్చుతో ముగుస్తుంది. ఉదా: తెలుగు – గ్+ఉ (ఉ), ఇల్లు (హౌస్) – ల్+ఉ (ఉ), తీసుకో (కొను లేదా తీసుకో) – క్+ఓ (ఓ), రా (కమ్) ర్+ఆ (ఆ)... ఇది నిజంగా ఆసక్తికరమైన విషయమే కదూ?... చివరకు చందమామ (అ) అనే పదం కూడా తెలుగులో అచ్చుతోనే ముగుస్తోంది!





| English | Why worry so much? | What is your problem ? |
|---|---|---|
| Telugu | ఎందుకంత ఆందోళన పడుతున్నారు? | మీ సమస్య ఏమిటి? |
| Hindi | इतनी चिन्ता क्यों कर रहे हो?<br>ఇత్నే చింతా క్యోఁ కర్ రహే హో. | तुम्हारी समस्या क्या है?<br>తుమ్‌హారే సమస్యమ్ క్యా హై ? |
| Tamil | ஏன் இத்தனை கவலை?<br>ఏన్ ఇత్తనై కవలై? | உன்னுடைய பிரச்சினை என்ன?<br>ఉన్నుడియ ప్రచ్చనై ఎన్నా? |
| Bengali | এত চিন্তা করছেন কেন?<br>ఎతో చింతా కొర్చెన్ కెనో? | আপনার অসুবিধাটা কী?<br>ఆప్‌నార్ అసుబిద్దాహోటా కే? |
| Marathi | इतकी काळजी का ?<br>ఇటకి కలజి కా? | तुझी समस्या काय आहे?<br>టుజి సమస్య కే ఆహె? |
| Kannada | ಇದಕ್ಕೆ ಯಾಕೆ ಇಷ್ಟು ಚಿಂತೆ?<br>ఇదక్కె యాకె ఇష్టు చింతె? | ನಿಮ್ಮ ಸಮಸ್ಯೆ ಏನು?<br>నిమ్మ సమస్యె ఏను? |
| Oriya | କାହିଁକି ଏତେ ବ୍ୟସ୍ତ ହେଉଛ?<br>కాహిన్‌కి ఎటె బ్యస్త హుచ్చా | ତୁମର କଣ ଅସୁବିଧା ଅଛି?<br>తుమారా కనా అసుబిధా ఆచ్చి? |
| Gujarati | આટલી ચિંતા કેમ કરો છો?<br>ఆటలె చింతా కెమ్ కరో చ్చొ? | તમારી સમસ્યા શું છે? |
| Assamese | কিয় ইমান চিন্তা কৰা ?<br>కియో ఇమన్ చింతా కొర? | তোমাৰ সমস্যাটো কি ?<br>తుమర్ గ్జమష్యటు కి? |
| Malayalam | എന്തിനാണ് ഇത്രയധികം ആശങ്കപ്പെടുന്നത്?<br>ఎంథినరు ఇథుర్యథికమ్ అశాంకప్పొడున్నథు? | എന്താണ് നിങ്ങളുടെ പ്രശ്നം?<br>ఎంతరు నింగలుదె ప్రశ్నమ్? |
| Santali | ᱪᱮᱫᱟᱜ ᱩᱱᱟᱜ ᱫᱩᱠ ᱫᱚ?<br>చెడాగ్ ఉనగ్ దుక్ దో? | ᱟᱢᱟᱜ ᱮᱴᱠᱮᱴᱚᱱ ᱪᱮᱫ?<br>అమగ్ ఎట్కె-టోన్ చెద్? |
| Sanskrit | किमर्थम् एतावती चिन्ता?<br>కిమర్తమ్ ఎతవతి సింతా? | का तव समस्या?<br>కా తవ సమస్యా? |

## గుమ్మడికాయ ఉపయోగం!



దక్షిణాదిలో ముఖ్యంగా తమిళనాడులో కొత్తగా కట్టే ప్రతి ఇంటి ముందూ అది పెద్దదయినా, చిన్నదయినా – పెద్ద గుమ్మడికాయను వేలాడదీయడం కనిపిస్తుంది. వట్టి గుమ్మడికాయే కాదు; మనల్ని చూస్తున్నట్టు దానిమీద భయంకరమైన రాక్షసుడి బొమ్మకూడా ఉంటుంది. ఇది మనల్ని భయపెట్టడానికి కాదు. చూసేవాళ్ళ 'కనుదిష్టి' ఆ ఇంటి మీద పడకుండా ఉండేందుకు. ఏవైనా కొత్తపనులు ప్రారంభించి పూజలు జరిపినప్పుడూ, నూతన వాహనాలను కొన్నప్పుడూ, నిమ్మకాయలతోపాటు గుమ్మడికాయలను దిష్టితీసి వీధుల్లో కొట్టడం ఇక్కడి అలవాటు. కొందరైతే ప్రతి అమావాస్యకూ గుమ్మడికాయలు కొడుతూ ఉంటారు.

## దుష్టుడా? దేవుడా?

మహాభారతంలోని దుర్యోధనుడి పాత్ర గురించి మీరేం అనుకుంటున్నారు? మామూలుగా దుర్యోధనుడు అనగానే పాండవుల పట్ల విపరీతమైన అసూయా ద్వేషాలు కనబరచిన దురహంకారిగా, స్వార్థపరుడిగా, మంచి మాటలను పెడ చెవిని పెట్టిన దుర్మార్గుడిగానే కనిపిస్తాడు. అయితే, ఉత్తరకాశిలోని జమునా లోయలో నివసిస్తున్న కొన్ని తెగల ప్రజలు ఈ మాటను అంగీకరించరు. ఎందుకంటారా? మానధనుడైన దుర్యోధనుణ్ణి వాళ్ళు తమ దేవుడిగా పూజిస్తున్నారు!



# అట్టమీది బొమ్మ

## విశ్వరూపం

ఈ నెల ముఖచిత్రాన్ని దివంగతులైన మా సీనియర్ చిత్రకారుడు శ్రీ వడ్డాది పాపయ్య 1980లలో చిత్రించారు. వినాయక చవితి పర్వ దినం సందర్భంగా ఈ చిత్రాన్ని ఈ నెల అట్టమీది బొమ్మగా తిరిగి ప్రచురిస్తున్నాము.

గణపతి తన అయిదు తలలతో భారీ రూపం ధరించిన నేపథ్యంలో ఆ విశ్వరూపాన్ని ఈ చిత్రం ప్రదర్శిస్తోంది. బ్రహ్మదేవుడు గణేశ విగ్రహ విశేషాలను వివరిస్తూ కథ చెబుతాడు. ఒకసారి స్వర్గాధిపతి దేవేంద్రుడు, ఐరావతం సహోదరుడైన గజేంద్రుడిని అవమానిస్తాడు. ఈ సందర్భంగా 'దేవేంద్రుడు ఏదో ఒక రోజు తన ముందు తలవంచుతాడ'ని గజేంద్రుడు జోస్యం చెబుతాడు. ఆ సందర్భాన్ని తలపిస్తూ ఏనుగు తలను తనదిగా చేసుకున్న వినాయకుడి విశ్వరూపం ముందు దేవేంద్రుడు మొక్కుతుండటాన్ని ఈ చిత్రం ప్రదర్శిస్తోంది. గణపతిని తాను గతంలో అవమానించినందుకు పశ్చాత్తాపం తెలుపుతూ ఇంద్రుడు తన చెవుల్ని రెండు చేతులతో పట్టుకుంటున్నాడు.

ఈ దృశ్యాన్ని బ్రహ్మదేవుడు మరింత వివరంగా వర్ణిస్తున్నాడు. విఘ్నేశ్వరుడు పూర్తిగా బ్రహ్మ సృష్టి. అయిదు గణాలు లేదా పంచభూతాలను –నీరు, గాలి, అగ్ని, భూమి, ఆకాశం– తనలో కలిగి ఉన్నందున అతడు మహాగణపతి అయ్యాడు. భౌతిక, మానసిక శక్తులకు ప్రతీకగా గణపతి ఏనుగుతొండం నిలుస్తుంది. ఇతడి విశ్వరూపంలో ఈ అంశమే వ్యక్తీకరించబడింది. అదే సమయంలో అతడు తన చిన్న వాహనమైన మూషికంపై ప్రయాణిస్తుంటాడు. ఏనుగు తల రెండు చిన్న కళ్లను కలిగి ఉంటుంది. కాని అవి సూక్ష్మాతిసూక్ష్మ వస్తువులను కూడా చూడగలిగేటంత శక్తిమంతంగా ఉంటాయి. అంటే గణపతి చూపునుంచి ఏదీ దాక్కోలేదని ఇది తెలుపుతుంది. అతడి పెద్ద చెవులు విశ్వం లోని ఏమూల నుంచైనా భక్తులు చేసే ప్రార్థనలను వినగలుగుతాయి. అదేవిధంగా పొడవాటి తొండం తను కోరుకున్న ప్రతిదాన్ని అందుకోగలుగుతుంది. ఆవిధంగా విశ్వ సంపదను మొత్తంగా అతడు పొందగలిగే స్థానంలో ఉన్నాడు. ఏదైనా కార్యాన్ని సాధించాలని కోరుకునే ప్రతి ఒక్కరూ మొదటగా విఘ్నేశ్వరుడినే పూజిస్తారు. విఘ్నేశ్వరుడు భాద్రపద మాసంలోనే అవతరించాడు.

అందుకనే భాద్రపద మాసంలో శుక్లపక్ష చతుర్థినాడు విఘ్నేశ్వరుడిని పూజించినవారికి కోరిన కోరికలన్నీ సిద్ధిస్తాయని ఒక నమ్మకం. ఆవిధంగా కార్యసాధనలో ఎదురయ్యే ప్రతి ఆటంకాన్ని ఎదుర్కొనేందుకు కావలసిన శక్తిని, ధైర్యాన్ని వీళ్లు పొందుతారు.

ఈ నెల అట్టమీది బొమ్మను, దానితో పాటు ప్రచురించిన ఉన్న కథను మీరు ఆస్వాదించారని భావిస్తున్నాము. వచ్చే నెలలో కూడా అట్టమీద బొమ్మ రూపంలోని మరొక చందమామ సుందరమైన కళా సృష్టితో మీ ముందుకు వస్తాము.

విదూషకుడు

బీర్బల్



# నిజమైన అపరాధి



1. ఒకరోజు, ఒక సంపన్న వ్యాపారి తన డబ్బు సంచీ పోగొట్టుకున్నాడు. అతడి ఇంట్లో ఆరుగురు సేవకులు ఉన్నారు. ఆ దొంగ వీళ్ళలోనే ఒకడై ఉంటాడని వ్యాపారి నమ్మకం.



2. వ్యాపారి బీర్బల్ వద్దకెళ్లి నిజమైన దోషిని కనుక్కోవడంలో తనకు సాయపడాలని అర్థించాడు. మీ సేవకులను ఈ సాయంత్రం నా ఇంటికి పంపించవలసిందని బీర్బల్, వ్యాపారిని కోరాడు.



3. ఆ ప్రకారంగానే, సేవకులందరూ బీర్బల్ ఇంటికి వెళ్లారు. బీర్బల్ సమానమైన పొడవుగల ఆరు పుల్లల్ని వారికోసం సిద్ధం చేశాడు.



4. 'అందరూ ఇటు చూడండి! ఇవి మహిమ గల పుల్లలు! తలా ఒకటి తీసుకుని మీరు ఇక్కడే నిద్రపోండి!'



5. బీర్బల్ వారికి వివరించి చెప్పాడు. 'ఇవి మహిమ గల పుల్లలని మీకు చెప్పాను. డబ్బు సంచిని దొంగిలించిన వాడి దగ్గర ఉన్న పుల్ల ఈ రాత్రికే ఒక అంగుళం మేరకు పెరుగుతుంది'.



6. సేవకులలో ఒక్కరు తప్ప అందరూ గాఢంగా నిద్రపోయారు. 'రేపు ఉదయం నేను పట్టుబడటం ఖాయం. నా వద్ద ఉన్న పుల్లను అంగుళం మేరకు ఇప్పుడే కోసివేస్తాను'.



7. అనుకున్నదే తడవుగా అతడు తన వద్ద ఉన్న పుల్లను చిన్నదిగా చేయసాగాడు. పుల్లను కోసి వేసిన తర్వాత అతడు నిమ్మళంగా నిద్రపోయాడు.



8. మరునాడు ఉదయం, బీర్బల్ చెప్పాడు. 'నేను రాత్రి చెప్పింది నిజం కాదు. వాస్తవానికి, దోషి వద్ద ఉన్న పుల్ల ఒక అంగుళం మేరకు కురచ అవుతుంది'.



9. అసలు దోషి ఉన్నఫళాన బీర్బల్ పాదాలపై పడి తప్పు ఒప్పేసుకున్నాడు. 'క్షమించండి ప్రభూ!' తర్వాత బీర్బల్ అతడిని వ్యాపారికి అప్పగించాడు.



## లెక్కించండి చూద్దాం

ఈ చిత్రంలో కొన్ని పక్షులు ఒకదానిపై ఒకటి పడిపోయి ఉండటం మీరు చూస్తున్నా. బొమ్మను నిశితంగా పరిశీలించి దానిలోని పక్షుల సంఖ్యను లెక్కించండి. మొత్తం పక్షుల సంఖ్యను కింద ఇచ్చిన గడిలో పొందుపరచండి.



# కొత్త ప్రపంచ వింతలు

ఈ నెల ఏడు కొత్త ప్రపంచ వింతలకు సంబంధించిన చిత్రాలతో స్క్రాప్ బుక్‌ను రూపొందిద్దాము.



చైనా పెద్ద గోడ, చైనా



మచ్చు పిచ్చు, పెరూ



కొల్లోజియం, ఇటలీ



గిజా మహా పిరమిడ్, ఈజిప్ట్



ఏసు రక్షకుడు, బ్రెజిల్



చిచెన్ ఇట్జా, మెక్సికో

